# శ్రీభక్తచింతామణి


కవిశేఖర, సూక్తిసుధానిధి

వడ్డాది సుబ్బారాయకవి

వ్యావహారిక తాత్పర్యకర్త :

బొమ్మకంటి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

# విన్నపం

గురువుకు నమస్కారం, అవిఘ్నమస్తు.

విన్నగాక మొన్నటి దాకా యీ గ్రంథం గురించిగాని, యీ కృతి కర్తయిన వసురాయ కవి గురించిగాని అంతోయింతో తెలియని వాళ్ళంటూ ఆంధ్రదేశంలో అరుదు-

ఇవ్వేళ మాత్రం ఆయన గురించి యే కొంతయినా తెలిసుండడమంటే అదో బిరుదు.

దైవం పట్ల అకుంఠిత విశ్వాసం, భక్తి, కృతజ్ఞత, ఆశ్రితత్వం, స్తోత్రపాఠాలతో నిండిన ఈ పుస్తకము కొందరు "సిద్దాంతు"లకి వేలం వెర్రిగానూ చాదస్తంగానూ అనిపించవచ్చునుగాక! వసురాయనిలోని భక్తి మూఢత్వంగా తోచవచ్చునుగాక! తద్వ్యతిరిక్తంగా కొందరు భక్తులకిది పవిత్రగ్రంథంగా అనిపించవచ్చునూగాక! కాని రసాస్వాదనా పరులైన సహృదయులకి మాత్రం ఇదొక అద్భుతమే! అయితే....

"ఎంత భక్తుడయితే మాత్రం? పోనీ ఓ వంద పద్యాలు యేవో శతకంటా వ్రాసుకోవచ్చుగదా! ఇన్ని పద్యాల్రాయడమేమి?" టన్నారు కొందరు సమకాలీనులు.

అటువంటి వారికి సమాధానంగా, అనాడే "ఆంధ్రి" పత్రికలో మహాకవి శ్రీమధునా పంతులవారు "అంటారేగాని అన్ని పద్యాలు వ్రాయగలవారేరీ?" అంటూ ప్రతికూలవర్గాన్ని మృదువుగా మందలించారు.

"అంతటితో విమర్శకులు ధోరణి మాగ్గా"రాసేదేముందిలేగాని అందులో వస్తువేముంది? అంతా దైవాధీనం సర్వీసేకదా!" అని....

అనుకూల వర్గం అందుకుంది "అన్ననా! విశ్వకవి రవీంద్రుడి గీతాంజలి కూడా దైవాధీనం సర్వీసేగదా" అంటూ.

"గీతాంజలితో ఈ భక్తచింతామణికి పోలికా?" అంది ప్రతికూలం

"పోలికేమిటీ? ....నిజం చెప్పాలంటే కొన్ని కొన్ని పద్యాల్లో టాగూరుని మించిపోయారు వసురాయల" వారంటూ సోదాహరణంగా కొన్ని పద్యాల్ని చూపించడంతో ప్రతివాదులు మౌనం వహించక తప్పలేదు.

o o o

# ఇందలి పాత్రములు

| | | |
|---|---|---|
| జనాబాయి | : | కథానాయిక |
| విఠోబా | : | జనాబాయి తండ్రి |
| నామదేవులు | : | జనాబాయి గురువు |
| రాధాబాయి | : | నామదేవుల భార్య |

శ్రీకృష్ణుఁడు, భక్తులు మున్నగువారు వత్తురు.

---

వరా :—అనుబంధ మున్నచోట పాటలు పాడవలెను.

శ్రీ ర స్తు

# భ క్త చిం తా మ ణి

## కృత్యాది-తాత్పర్యాణి

శా. శ్రీమద్భానుసహస్రసమండలవిభాసీ ! సచ్చిదానందమూ
ర్తీ ! మాయాపరికల్పితాఖిలజగచ్ఛ్రేణీ ! దయాంభోనిధీ !
స్వామీ ! నీ మహిమంబు లా నిగమముల్ వర్ణింప లేవన్నచో
నే మూఢాత్ముడ నే నెఱుంగుదును ? దంస్ట్రీ ! భ క్తచింతామణీ ! 1

తా. శ్రీమంతాలయిన కోటి సూర్య మండలాల సమ్మిళిత కాంతితో ప్రకాశించే వాడా! సత్-చిత్-ఆనంద-ములే ఆకృతియైన వాడా! మాయామహ త్తత్త్వ మాత్రం చేతనే యీ యనంత కోటి బ్రహ్మాండాలనూ కలిగించినవాడా! దయా సముద్రుడా! యజమానీ! ఆది విద్యలయిన వేదాలే నీ వీఖ్యాతులను వర్ణించలేకపోతుండగా-ఆద్యంత విద్యా రహితుడనైన నేనెలా తెలుసుకోగలుగుతాను? (తెలుసుకోలేను-అయినప్పటికీ) భక్తుల కోరికల్ని బేషరతుగా తీర్చిపెట్టడంలో చింతామణి * వంటివాడా! నాకీ జన్మను (భవాన్ని) కల్పించినవాడా! (దయతో నాకు నీ సమస్త వీఖ్యాతులనూ తెలుసుకునే వీలును కల్పించు)

---

*. ఏది తలుచుకుంటే దానిని ప్రసాదించే దానిని "చింతామణి" అంటారు. ఇది ఒక రత్న విశేషం. క్షీర సాగర మథనంలో కామధేనువు-కల్పవృక్షాలతో బాటే ఇది కూడా వెలువడింది. దానిని ఇంద్రుడు కైవశం చేసుకున్నాడు. ఆ చింతామణి ఎవరి దగ్గర వుంటే వారి సమస్తమైన ఐహిక వాంఛలు తీర్చబడతాయి. అదే విధంగా భక్తుల-పారమార్థికుల ఆయిహికాముష్మికసర్వ వాంఛలనీ పరి పూర్తిచేయగల చింతామణి, భగవంతుడే తప్ప అన్యం కాదనే భావంతో "భ క్త చింతామణి" అనే మకుటంతో ఈ పద్యాలు వ్రాయబడ్డాయి.

కొనియున్నది. ఈ ప్రసాదమను గుణమును "సకలరస సాధారణమును సకలరచనా సాధారణమునుగా సహృదయ చక్రవర్తి యగు నానంద వర్ధనాచార్యులు నిరూపించిరి. ఇట్టి ప్రసన్న రమణీయమగు కవితా ధారతో నీ కవి యీ జనాబాయి చరిత్రమును నాటకమునుగా రచించి మన నేత్రేంద్రియములకు "కాన్తం క్రతుం చాక్షుషం" అనినట్లుగా యజ్ఞమును సమకూర్చి ఆనందము, పుణ్యము, భక్తి, మోక్షముగూడ సమకూరునట్లొనర్చినాడు. ఇట్టి కవి చంద్రున కితోధిక శ్రేయస్సుల సమకూర్చి యింకను నిట్టి మృదుమధుర శైలిగల గ్రంథములు రచింప జేసి శ్రీ విఠలస్వామి తన కైంకర్యమును నెరవేర్చుకొనుగాత మని యాశించుచున్నాను.

"భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః"

గుంటూరు
10–1–45

శిరోమణి వేదాల తిరువేంగళాచార్యులు,
సంస్కృత పండితుడు, ఏ. సి. కాలేజి.



## భగవన్మహిమాదివర్ణనము

శా. ఓనిర్హేతుకజాయమానకరుణా ! యో నిర్వికారప్రభూ !
యో నిర్వ్యాజపరోపకారసుకృతీ ! యో నిత్య ! యో నిర్మలా !
యో నానాంతరయామి ! విశ్వసృజ ! విశ్వోపాస్య ! విశ్వాత్మకా !
జ్ఞానానందమయస్వరూప ! వరదా ! సద్భక్తిచింతామణీ ! 5

తా. ఏకారణము లేకుండానే ప్రపంచాన్ని కరుణించేవాడా! ఎటువంటి వికారాలు ఎఱుగని వాడా! పూర్వ పదవిచారణ చేయకుండానే, తలుచుకున్న వారందరికీ ఉప కరించేవాడా! ఎప్పుడూ వుండేవాడా! కళంకరహితుడా! అన్నిటియందునా సంచరించే వాడా! సర్వాన్నీ సృష్టించినవాడా! సృష్టిచేత మహైక్యంగా ఆరాధింపబడేవాడా! విశ్వా నికి ఆత్మవయినవాడా! జ్ఞానంవలన మాత్రమే లభించే ఆనందానికి స్వరూపమైన వాడా ! వరాలనిచ్చేవాడా ! భక్తుల కోరికలు తీర్చేవాడా !
(తరువాతి పద్యంలో అన్వయం.)

మ. ప్రకటత్వద్గుణరాసులం గొలుచుచోఁ బాథోధివార్బిందువుల్;
సకలక్ష్మాతలరేణువుల్; గగననక్షత్రంబు లత్యంతసం
ఖ్యకు నొక్కండుగ సల్గకైనఁ బరమాత్మా ! చాలునో చాలవో !
యకలంకాంచదనంతభవ్యగుణధామా ! భక్తచింతామణీ ! 6

తా. దోషరహితాలూ, నిరంతరాలూమైన గొప్పగుణాలు కలవాడా! సముద్రం లో నీటి బిందువుల్నీ, ఆకాశంలోని చుక్కల్నీ భూమ్మీది మట్టికణాల్ని లెక్కపెట్టి, అన్నిటినీ కలిపి కూడినా-ఆ మొత్తం సంఖ్య-నీ అనంత విభూతులలోని-ఒక్క విభూతి విశేషాల పోటీ చేయదు.

మ. పదలాలిత్యము, నర్థగౌరవము, భావవ్యక్తిః సారస్యసం
పద, నానాద్భుతకల్పనల్, గలుగుకావ్యం బాకవిం బోలె ని
న్నెదలో మెచ్చి నుతింపఁజేయదె భవత్స్రష్టప్రపంచంబు ! ప్రమో
క్కెద, ముద్దాడెద, నీపదంబు లనురక్తిన్, భక్తచింతామణీ ! 7

తా॥ కవికులగురూ ! లలితమైన మాటలూ, అర్థగౌరవం, చక్కటి భావ వ్యక్తీకరణ, సారస్య సంపన్నత, వివిధాలయిన అద్భుతపుటూహలూతో సర్వలక్షణ సమన్విత కావ్యస్రష్టయైన కవి నెలా హృదయమారా మెచ్చుకుంటామో, అదే విధంగా-సృష్టిసమస్తాన్నీ రచించిన నువ్వుకూడా మహాకవివలే-కవికుల గురువు వలే నా మనసును రసోన్మత్తం చేస్తున్నావు.

ఇది భగవద్భక్తిని నిరూపించు చక్కని నాటకము. ఇందు వైష్ణవ భక్తి ప్రతిపాదితమైనను ఆయా స్థలములలో శివనామములను శైవులు భావించవలెను.

సికింద్రాబాదు
1936.

చిదిరెమఠము వీరభద్రశర్మ
సంపాదకుడు 'విభూతి'

* * *

శ్రీ మేడిపల్లి లక్ష్మీకాంతకవి నాకు సతీర్థ్యుడు, చిరకాల మిత్రుడు. ఈయన రచనలు చాలవఱకు ముద్రితములు. "నాకవనము" అని చక్కని కృతి రచించినారు. అది పలువురి పండితుల మెప్పుగాంచినది.

ప్రస్తుత కృతి భక్తజనాబాయి నాటకము మునుపు "విభూతి" పత్రికలో ప్రకటింపబడినది. "విభూతి" అనగానే శివసాయుజ్యమందిన శ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మగారు అమృత హృదయులు జ్ఞాపకము వచ్చుచున్నారు. ఆయన ప్రోత్సాహమునందని కవులా రోజులలో లేరు. మా లక్ష్మీకాంతముగారి రచనలు ప్రతిభాన్వితములు, ఆయన దృష్టి నాకర్షించుటలో ఆశ్చర్యములేదు.

ఈ నాటకము ఒక విధముగా త్రివేణీ సంగమము- శ్రీ పాండురంగ విఠలుని కృపాస్రవంతి, మా లక్ష్మీకాంతకవి ప్రతిభా ప్రవాహము, ప్రసన్న భక్త కథావాహిని: ఈ మూడును గంగా, యమునా, సరస్వతులు.

మా లక్ష్మీకాంత కవి ఇంకను ఉత్తమ కృతి రచనాధురంధరు డనిపించుకోవలెనని మా ఆకాంక్ష.

శ్రీనివాస సోదరులు,
శతావధానులు.



ఉ. గొనసుమ సూఁటెని సంగ్రహించుకొని, బొగ్గుం గారమున్ గంధకం
బును బోరెన్ దగఁ జొప్పువేసి, ఘనసంబుల్ మేటి లంకాపురుల్
గను నిర్మాణముఁ జేసి, ప్రోచి, తుద కెల్లన్ రూపు మాయింతు వే
డ్కను, సృష్టిస్థితినాశకారణుఁడ వౌటన్; భక్తచింతామణీ. 11

తా॥ ఔరే మాయయ్యా! గంధకమూ, బొగ్గూ, సురేకారమూ వంటి—సత్వ రజ స్తమాలనే మూడు గుణాలనీ మిశ్రితంచేసి, లంకానగరాల వంటి ఈ లోకాలను నిర్మించి, పెంచి-పోషించి, చివరగా నీ వేడుకకోసం అన్నింటినీ దహించి, జననీ జనకమారకుడివై విరాజిల్లుతున్నావు. [ప్రపంచం త్రిగుణాలనే దాహక పదార్థాలతో కూడిన మందుగుండు గిడ్డంగిలాంటిది!]

మ. ధులినాథుండు నిజాంగకంబు లెటు లట్టుల్, లోకముల్ నీవు కౌ
శల మొప్పన్ వెలిఁ దార్తు, లో నడఁతు విచ్ఛామాత్ర; నీ కుక్షిఁ జీ
మలు పుట్టం బలె నెన్నియే నిముడు బ్రహ్మాండంబు, లాకాశముం
బలె నీ వంతట నిండి యుందు; పరమాత్మా! భక్తచింతామణీ 12

తా॥ పరమాత్మా! తాబేలు యే విధంగానయితే అవసరార్థం తన యవయవా లను డిప్పలో భద్రపరచుకోడమూ—వెలిపరచటమూ చేస్తూంటుందో, అదే విధంగా నువ్వుకూడా అపూర్వమైన నైపుణ్యంతో ఈ లోకాల నొకసారి బయటకు ప్రకటింప చేస్తావు—మరొకసారి, నీ లోపలకు అణుముకుంటావు. కేవలం నీ సంకల్పమాత్రం చేత, అతి చిన్న పుట్టలో పట్టే అసంఖ్యాకమయిన చీమలమల్లే—యెన్ని బ్రహ్మాండా లయినా నీ కడుపులో ఒక ప్రక్కకు సరిపోవు. ఆకాశం (శూన్యం) వలె నువ్వు మాత్రం సర్వత్రా వ్యాపించే వుంటావు.

శా. నీసంకల్పమె సృష్టి; నీవు గనుఁగొంటే రక్ష; నీ పూరకుం
టే సంహారము సూ; మహాత్మ! యటు గా కీ భూమి, యీసాగరం
బీ సర్వాద్భుతభూతకోటి, యిఁక వేవెలాగు సర్గంబు గా
నీ, సంరక్షణ గాని సేయఁ దరమౌనే? భక్త చింతామణీ. 13

తా॥ సర్వేశ్వరా! నీ సంకల్పమాత్రం చేతనే యీ సృష్టి పంభవిస్తుంది. నువ్వు దీనిని కనిపెట్టుకుని వున్నన్నాళ్ళూ కళకళలాడుతూంటుంది. ఉపేక్షించావో మొత్తం వల్లకాడయిపోతుంది. అలా కాని పక్షంలో యీ నింగీ, నేలా, నిప్పూ, నీరూ, గాలీ-అనే పంచభూతాన్వితమైన ప్రపంచానికి-సృష్టి స్థితి లయాలనేవి యెలా యేర్పడతాయి తండ్రీ!

నామదేవాదిభక్తు లనవరతంబు
సేయు భజనామృతము గ్రోలు చెవులు తనియ.

భక్తులు: (పాండురంగని గుడిలోఁ బ్రవేశింతురు)

జనా, విఠోభా: (సింహ ద్వారమును దాటి గుడిలోఁ బ్రవేశింతురు)

జనా: ఆహా! ఏమీ లక్ష్మీవల్లభు నాలయము! ఏమీ తాళమృదంగాది సంకీర్తనస్వనము!! రమాకాంతా! ఆద్యంతరహితా! త్రిగుణాతీతా!

కం. తనువాఙ్మనఃక్రియల నిను
ననయము భజియించి తనియ నబలల కైనన్
గన నొండు తలఁపు గలుగునె?
మునినుత! లక్ష్మీశ! విబుధపూజ్యా! ముకుందా!

భక్తులు: (వీరిని పరికింతురు)

౧ వ భ: ఆహా! ఏమీ తన్వి భక్తి పారవశ్యము! పదునా ఱేండ్ల లేఁబ్రాయమున నింతభక్తి నార్జించి వేదవేదాంగాది సమస్త గ్రంథార్థముల నెఱిఁగిన దీ నారీరత్నము. భక్త శిరోమణి. ఆనందము! పరమానందము!

భక్తులు: (వీరికి నమస్కరింతురు)

జనాబాయి, విఠోబా: (పునరభివాదము గావింతురు)

౨ వ భ: అయ్యా! తమ నామంబులఁ బవిత్రములైన వర్ణముల వినఁ గోరెదము.

విఠో: అయ్యా! నా పేరు విఠోబ. ఈమె నా కూతురు జనాబాయి.

౩ వ భ: తల్లీ! మీతోడ మేమును హరిని భజింతుము. పాండురంగ సంకీర్తనమున మమ్ము ధన్యులఁ గావింపుఁడు. భక్తిమార్గమును నెలకొల్పుఁడు.

జనా: భక్తులారా! రండు. భగవత్సాన్నిధ్యమును జేరి హరినిఁ గీర్తింతము. (౧ వ అనుబంధము) (అందఱుఁగలిసి పాడుదురు)

జనా: (స్వామికి నమస్కరించి) హా! జగద్రక్షకా! ఆపదుద్ధారకా!!

మ. జగ మన్యోన్యవిరుద్ధ వస్తువులతో సంపూర్ణమై యుండియున్,
దగవుం ధర్మముఁ గల్గి వర్ధిలుట కాధారంబు నీవే గదా !
పగ సాధింతు మటంచు దుర్మదమునన్ బాపాత్మకుల్ రేఁగినన్.
సిగపూ వాఁడగ నీవు సాధులకుఁ దండ్రీ ! భక్తచింతామణీ. 17

తా. అద్వయా! పరస్పర విరోధవస్తుజాలంతో నిండివుండి-ధర్మాధర్మాలు రెండూ కొనసాగుతూన్నప్పటికీ విశ్వమిలా వర్ధిల్లడానికి నీవే కారణం. పగలే ప్రధానంగా పెట్టుకుని, అతి గర్వంతో పాపాత్ములెంత చెలరేగినా ధర్మాత్ములూ-సాధువులూ అయినవారికి సిగపూవయినా వాడనీయవుగదా! (అనగా-ఏప్రమాదమూ కలగనీయవు-అని అర్థం)

మ. ఫలభారంబున వంగు వృక్షమును గాపాడంగఁ దోటొగ్గు న
ట్టులు, ధర్మప్రతిపాలనైకరతిఁ గీడు ల్మాఁడుపుణ్యాత్మ న
ర్మిలి రక్షింతువు నీవ యడ్డపడి; తండ్రీ ! ధర్మ మేపక్ష, మ
వ్వలనం దోడ్పడ, వేచియుండుదువు గావా ? భక్తచింతామణీ. 18

తా. తండ్రీ! ధర్మం యేపక్షానవుంటే, నువ్వాపక్షాన్నే వహించి, వారికి సహాయం చేసేందుకు సిద్ధంగావుంటావు. పండ్లభారంతో ఒరిగిపోయే చెట్టుకు ఏదో ఒక ఊటుపెట్టి నిలబెట్టినట్లు, అధర్మపరులవలన హానిపడే ధర్మాత్ములకు ఊటువై-వారిని రక్షిస్తావు.

మ. కురియు న్వానన, గాలి, మబ్బులు, మెఱుంగుల్ గర్జలున్, గూడువై
ఖరి బాగోఁగులు రాఁగలట్టి తఱిఁ, దత్కార్యానుకూలంబుగా
ధరఁ బ్రోగయ్యెడు నెక్కడెక్కడవొ నీతంత్రంబునన్; జిత్ర మె
వ్వరు నీ చిత్త మెఱుంగ రా ఫలము; దేవా ! భక్తచింతామణీ. 19

తా. దేవాది దేవా! వానపడుతుందీ అనగానే గాలీ, మబ్బులు, మెరుపులు, ఉరుములు—ఎలా ఏర్పడుతాయో, అదే విధంగా కలగబోయే మంచిచెడ్డలకు సూచనలుకూడా-నీ తంత్రంవల్ల శకునాలూ వగైరాలు ఏర్పడుతూ వుంటాయి. కేవలం నువ్వు మాత్రమే కల్పించగలిగిన యీ వింతలనెవ్వరూ అర్థం చేసుకోలేరు కదా తండ్రీ!

ఇవ్వసుధన్ ఋణంబు నశియించెదుదన్క నె ప్రేమబంధముల్
చివ్వన: బాండురంగవిభుసేవ: దొలంగు సమస్తబంధముల్.

విఠో: కుమారీ! ఏల యిట్టి యనర్థవాక్యము లాడెదవు? నీకు: దగిన వరుని గొనితెచ్చి యిల్లటమునుంచుకొని మీ ముద్దు మురిపములను ముచ్చటగా:జూచి ముకియనున్న నాకీయాశాలతను వమ్ము సేసెదవా? కట్టా! జాయావియోగానల సంతప్తహృదయమునకీ సంతాన వియోగమును గోరుచుట్టుపై రోకటిపోటువలె బాధించుచున్నదే? పుత్రీ! పుత్రీ! 'మాతృదేవోభవ, పితృదేవోభవ' యను సూక్తి నెఱుగవా?

జనా: జనకా! ధర్మశాస్త్రములు పరస్పర విరుద్ధములు కావు! కావు!! అగాధములు. కించిజ్ఞుల కగ్రాహ్యములు. సర్వజ్ఞులగు మీ బోంట్లకే నేమని చెప్ప:గలను? కరుణించి నన్నిట వదలు:డు.

ఆవ భ: అయ్యా! ఈ బాలిక నేల సంసారసాగరమున: బడద్రోసి దిక్కుగానక పరితపింప:జేయుదురు? పురాకృత వశమున నింత పిన్న వయస్సున నిట్టి విరాగిణియగుట నెంతయు ధన్య. ధన్యులలో ధన్య. ఇట్టి యుత్తమాంగన హృదయమును నొప్పింపకు:డు. భక్తులు తపించిన భగవంతుడు బాధచెందును. సర్వాంతర్యామి సర్వేశ్వరు:డు మీబిడ్డను దనబిడ్డవలె రక్షించుకొనును. మామనవి నాలించి మమ్ము క్షమింపు:డు.

విఠోబా: (దీర్ఘముగా నాలోచించి నిట్టూర్పువిడిచి) హా! పాండురంగా! పండరీనాథా!!

తే. గీ. నీదు వరలబ్ధ బహుముగ్ధ, నీదుభక్తి
పరవశంబున నెగడొందు భక్తురాలు,
నాదునేకైక పుత్రిక, నీదు పాద
సేవనాకాంక్ష నెటుల: బ్రోచెదవొ దేవ!

పుత్రీ! పాండురంగ:డు నిన్ను రక్షించుగాత! (నిష్క్రమించును)

## భ గ వ త్సే వ

శా॥ వేదం బంతయు లక్షణం, బఖిలమౌ విశ్వంబు లక్ష్యంబు గా,
నాదిగ్రంథము నీ వొనర్చితివి సర్వార్థ ప్రదర్శనంబుగా;
నో దేవా! యది చెప్పగాఁ జదువుచున్యల్, సంశయాపేతులై
మోదం బొందుచు నిన్నుఁ గొల్తురనిశంబున్; భక్తచింతామణీ 23

తా. కృతిపతీ! సమస్తమయిన విషయజ్ఞానప్రదంగా ఈ ప్రపంచమే లక్ష్యంగా లక్షణశాస్త్రాన్ని వేదరూపంలో విరచించి వుంటావు. ఆ వేదాన్ని చదివేవారంతా విస్సంశయులై, నిర్మలానందమగ్నులై, నిరామయుడివైన నిన్ను నిత్యం ఆరాధిస్తున్నారు.

మ॥ మనుజుల్ భిన్నపదస్థు: లందఱకు దా మధ్యాహ్నమం దెవ్విధిన్
గనుపట్టున్ రవి సూటిగాఁ దలకు నాకాశంబునం, దవ్విధిన్
నిను ధ్యానించెడువారి కెల్ల నెదురన్ నీరూపు చూపట్టు, నో
యనఘా; హృద్గగనంబునందు; మునివంద్యా! భక్తచింతామణీ 24

తా. అనఘా! మధ్యాహ్నమయ్యే సరికల్లా సూర్యుడు ఏ ప్రాంతీయులకా ప్రాంతంలో సరిగ్గా నడినెత్తిన యెలా కనుపిస్తాడో, అదేవిధంగా భక్తచింతామణీశ! నిన్ను ధ్యానించే వాళ్ళెవరైనా వారే వాళ్ళమనసులనే ఆకాశంలో ప్రకాశమానమైన నీ రూపం కనబడుతూనే వుంటుంది.

మ॥ పులకింపం దను వెల్ల జల్లుమని, యుప్పొంగంగ సర్వాంగముల్,
గళమున్ గద్గదికం దగుల్ కొన, వడంకం గాలు సేతుల్, ముద
శ్రులు ముత్తెంబులు వోలె రాల, నెదురం జూపట్టుచున్నట్టె, నిన్
గొలువంగల్గు సుఖంబు యోగియె యెఱుంగున్; భక్తచింతామణీ 25

తా. భక్తచింతామణీ! శరీరమంతా ఘల్లునపులకరించగా, అవయవాలన్నీ మహానందంతో ఉప్పొంగగా, గొంతు మాటలురావిడై తడబడగా, కాళ్ళూ చేతులూ కంపించగా, కళ్ళమ్మట ఆనందాశ్రువులు ముత్యాల దండలా నేలరాలుతూండగా భౌతిక నేత్రాల ముందున్నట్లుగానే హృదయాకాశంలోనే నిన్ను సేవించగలగడం యోగులకు మాత్రమే సాధ్యం కదా!

పరమానంద స్వరూపిణి తానై భగవన్నివాసమున కాలయ మైనది. "అన్యజన్మని సర్వాత్మా విష్ణు రభ్యర్చితో మయా" అను రీతిని నీ బాలిక సర్వశక్తికి యగు విష్ణువును బూర్వజన్మమునఁ జక్కగా నారాధించి యుండనోపు! కాకున్న నెట్లు భగవత్సన్ని ధినిగూర్చుండి భగవద్ధ్యాన మొనర్చి తనకు వశ్యునిగా నొనర్చు కొనఁగలదు? (డాసి, శాంతగంభీర స్వనమున) బాలామణీ! భక్త శిరోమణివలెఁ గన్పట్టు నీ వెవ్వతెవు? నీ తలిదండ్రు లెవరు? నీ పేరేమి?

జనా: ఆర్యా! నా పేరు జనాబాయి.

తే. గీ. పండరీనాథుఁడే తండ్రి, పరమ పావ
ని యగు రుక్మిణియే జనని, అఖిలహరి
భక్తులే బంధువర్గంబు, పాండురంగ
నామభజనామృతమె జీవనామృతంబు.

నామ: ధన్యోస్మి! ధన్యోస్మి!! నారీరత్నంబవగు నిన్ను గాంచ నా కెంతయు నాహ్లాద ముదయించుచున్నది. "సత్సంగత్వే నిస్సంగ త్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" కాన నాతోడి ప్రసంగమున నీకును నానుకు మేలయ్యెడిని. జ్ఞానాన్వేషణమునకుఁ దావయ్యెడిని. భక్తిజ్ఞానమున నీ మనోరథం బీడేరును. నీ జన్మము ఫలించును. మీవంటి భక్తగోష్ఠిని నేను సర్వదా యాసింతు. నాయింట నుందువు రమ్ము. నన్ను నామదేవు డందురు.

జనా: చిత్తము.

నామ:
జనా: } (స్వామికిఁ బ్రదక్షిణించి వెళ్ళుదురు.) (౧ వ అనుబంధము)

(యవనిక వ్రాలును.)

(ప్రథమాంకము సంపూర్ణము)

మ. తలిదండ్రుల్ బలెఁ దప్పు లోఁగొనుచు వాత్సల్యంబునం బ్రోతు, నె
చ్చెలివయుం బోలె సుధామయోక్తులను మాక్షేమం బెఱింగింతు; కే
వల ధర్మప్రభువట్లు నీ ప్రజల యిబ్బందుల్ దొలంగింతు; ని
న్నెలమిం గొల్వమి మాదు భాగ్యదశ గాదే? భక్త చింతామణీ. 29

తా. గోవిందా! తలిదండ్రుల మాదిరిగా-మా తప్పుల్ని మన్నించి యెంతో వాత్సల్యాన్ని చూపిస్తావు. స్నేహితునివలె తీయని మాటలతో మా శ్రేయస్సును తెలియచేస్తావు. (దండనీతి నెఱగని · ధర్మరాజులాగా భక్తుల సమస్త కష్టాలనీ పటా యింప చేస్తావు. కాని, నిన్ను పూజించకపోవడం మా దౌర్భాగ్యమే తప్ప, నిన్ను సేవిస్తే సంభవించని సౌభాగ్యముంటుందా? ఉండదు)

మ. మన సే నెన్ని విధంబులం దెలపినన్, మౌఢ్యం బదేమో, జగ
జ్జనకున్ భీతిన కాని భక్తి నిను నిచ్చల్ గొల్వ నుత్సాహముం
గన; దీ విచ్చినవానిచోఁ గలుగురాగం బెల్ల, నీపట్లఁ జూ
పను దిద్దంగదె యచ్చెనంటి ననుకంపన్, భక్త చింతామణీ. 30

తా. ఆది మధ్యాంతరహితా! నా మనసుకిదేమి మూర్ఖత్వమోగాని, నేనెన్ని పార్లు బోధించినా జగత్పితవయిన నిన్ను భయంతోనే తప్ప, భక్తితో కొలవటం లేదు. నువ్వు నాకమగ్రహించిన వాటిపట్ల నాకున్న ప్రేమాభిమానాలను - నేను నీ పట్ల కూడా ప్రదర్శించేలా నా మనసును మళ్ళించు తండ్రీ!

శా. దేవా! నీ వొనరింతు శిక్ష లని భీతిం జెంది, నీపాదముల్
సేవింపన్ దలపోయుకంటెఁ, గరుణాసింధూ! భవత్ప్రాణి ర
క్షావైదుష్య మమక్షణం బనుభవజ్ఞానంబున గంచుఁ, బ్రే
మా విర్భూతిన విన్నుఁ గొల్చుట వరం బౌ; భక్తచింతామణీ. 31

తా. హే కరుణాసింధూ! నీ పట్ల అవిధేయతకు నువ్వు శిక్షిస్తావనే భయంతో నిన్ను సేవించడం కన్న, నీ వారయిన ప్రాణికోట్లను రక్షించడంలో నీకు గల పాండిత్యాన్ని అనుక్షణానుభవంతో అర్థంచేసుకుని, ప్రేమార్ద్ర హృదయంతో నిన్నారాధించ గలగడమే యదార్థమైన అదృష్టం.

అదుగో ! నా నాథుఁ డూరకే వచ్చుచున్నాఁడు. నేనేమి చేయుదును ? పాండురంగా ! నీవె దిక్కు.

నామ :
జనా : } (ప్రవేశింతురు)

రాధా : (లేచి సాదరముగా నమస్కరించును.)

నామ : సతీ ! రాధాబాయి ! నాకీదినమున నొక రత్నము లభించినది.

రాధా : నాథా ! రత్నమా ! అటులైన నిఁక మన దారిద్ర్య మీడేరును.

నామ : ఒక మన దారిద్ర్యమేకాదు. ఈ రత్న దీపికచేత మన యజ్ఞానాంధకారము సయితం మడుగంటును. (జనాబాయిని జూపించి) ఇదియేరత్నము, నారీరత్నము, భక్తరత్నము. నా భాగ్యవశమున నాకీ సుశీలతోడి సద్గోష్ఠి లబ్ధమయ్యెను. భగవద్భక్తులు తన్ను సంకీర్తన మొనర్చుచోట కమలాకాంతుడు కాపురము సేయును. ఇఁక మనకేమి కొదువ ?

రాధా : (ఆశాభంగముతో) మంచిది. అపరాహ్ణమైనది. చంద్రభాగ నదినుండి మంచినీళ్ళబుంగ యొక్కటి తెచ్చితిని. తండులములే తక్కువ.

నామ : వెఱ్ఱిదానా ! నన్నడిగెదవేల ? శ్రీమత్పాండురంగని నడిగి తెచ్చుకొమ్ము. పొమ్ము.

రాధా : చిత్తము. (జనాబాయిని జూచి) అమ్మా ! యీ చాపపైఁ గూర్చుండుము. (నిష్క్రమించును)

జనా : (కూర్చుండును.)

నామ : (సుఖాసీనుఁడై) జనాబాయీ !

తే. గీ. పిల్లుపిచర పల్లేరు పీడువోలెఁ
గామ క్రోధ లోభాది సంగతులు లేని
కేవలానంద సారహృత్క్షేత్రమందు
భక్తిబీజంబు నాటి తత్ఫలము గందు.

జనా : మహాత్మా ! తావక కృపావిశేషంబున ననుగ్రహింపఁబడితిని.

శా. ఏనుం గెక్కి చనంగఁ గుక్కలఱకున్! బా టింపకే ధై
ర్యానందంబున నేగునో, యటు తనూయాత్రన్, జగన్నాథు ని
న్నే నిక్కంపుసహాయుఁగాఁ గొనునరుం డేయాపదల్ వచ్చినన్
దానిన్ లక్ష్య మొనర్పఁ డించుకయు; దేవా! భక్తచింతామణీ. 35

తా. జాతవేదా! ఏనుగుమీద ప్రయాణం చేసేవాడు, వెంటపడే కుక్కలవి యేమాత్రమూ లక్ష్యపెట్టకుండా ధైర్యానందాలతో యే విధంగా ముందుకు సాగి పోతాడో-అదే విధంగా ఈ జీవనయాత్రలో తమకు నీ వొక్కడివే సహాయకుడివని త్రికరణాల నమ్మిన భక్తులు, బ్రతుకుతెరువులో యెదురయ్యే యే ఆపదలనూ లెక్క చేయరు.

మ. కవచంబున్ ధరియింప, మేని కది మే ల్కాపౌను గాకుండు నా
హవమందున్, హృది నిన్ను, దాలిచిన, భూమ్యాకాశతేజఃపయః
పవనోద్భూతచరాచరంబులను నే భంగంబు దేహాత్మ లొం
దవు, నిస్సంశయ మిందుఁ; నందుఁ; బరమాత్మా! భక్తచింతామణీ. 36

తా. భక్తచింతామణీ! శరీరంపైన ధరించిన కవచం, యుద్ధరంగంలో మనల్ని కాపాడనూ వచ్చు, కాపాడలేకపోనూ వచ్చు. కాని—మనసులో నిన్నే ధరించిన వారికి మాత్రం-పంచభూతాత్మక ప్రపంచసమస్తంలో యెటువంటిహానీ కలగదని నిస్సంశయంగా చెప్పవచ్చును.

శా. నా సామర్థ్యము గన్న, నాదెసఁ గనన్, నాయక్కఱల్ గాంచినన్,
నాసంసారము గన్న, నామనసు గన్నన్, నావిధుల్ గాంచినన్,
నీ సాంగత్యము, నీసహాయతయుఁ, దండ్రీ! ముఖ్యమంచెంచ న
య్యా? సర్వేశ్వర! నాకు నన్ దెలుపు; దేవా! భక్త చింతామణీ. 37

తా. జగద్గురూ! నా సంసారం విషయంలోగాని, సామర్థ్యం విషయంలోగాని, సంపాదన విషయంలోగాని, అవసరాల నిమిత్తంగాగాని, కర్తవ్యాలపట్లగాని, నా భావజాలాదికాలలోగాని-నిజంగా నాకు నీ సహాయంగాని, స్నేహంగాని ముఖ్యంగా నేననుకోవడంలేదు. మరెందుకీ సావాసమంటావా? తండ్రీ—దయచేసి "నీ తత్త్వ మేమిటో" చెబుతావని. (ఆత్మజ్ఞానాన్ని కలిగించమని)

అక్షరములను దెలిసికొనుటకై బాలురకు గుండ్రని జాతి ముక్కల నక్షరములుగఁ జెక్కి చూపించు విధమున, శుద్ధబుద్ధ పరబ్రహ్మ జ్ఞానము కలుగుట కొఱకు, కొయ్యలు, మన్ను, జాలతోఁ జేయఁబడిన విగ్రహముల స్వీకరించుచున్నారు. కాన, విగ్రహారాధన మవశ్య మాచరణీయము.

జనా : మహాత్మా! వ్యక్తోపాసన, అవ్యక్తోపాసనలకుఁ గల భేద మేమి ?

నామ : వ్యక్తోపాసనమనఁగా భక్తిమార్గము. అవ్యక్తోపాసన మనఁగా జ్ఞానమార్గము. ఇవి రెండు నన్నదమ్ములవలెఁ బూర్వాపరములై నడచి వచ్చుచున్న సాధనములు. ఈ రెంటిలో భక్తియను సాధన మధిక సులభము. మూలమునందు 'ఏకమే వాద్వితీయమ్' అయిన పరబ్రహ్మము, ప్రేమయు, శ్రద్ధయు, మొదలుగఁ గల్గిన మనోమయములగు నయనములచే మనుజులకు గోచరమగును. ఈ స్వరూపమునే వేదాంతశాస్త్రము పీశ్వరుఁ డనుచున్నారు. ఒక హరియే అంతటను వ్యాపించినవాఁడుగను, సర్వసముడుగ నున్నాఁడు. అయినను భక్తుల కొఱకు భగవంతుఁడు కొద్దివాఁడగు పాండురంగమూర్తి యగుచున్నాఁడు. 'బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే' 'వాసుదేవ స్సర్వమితి, స మహాత్మా సుదుర్లభః' ఒకసారి భక్తిమార్గము నవలంబించిన పిదప నీజన్మమునఁ గాకపోయినను మఱు జన్మమునను, ఆజన్మమున కానిచో మరుచటి జన్మమునను నొకప్పుడు కాకపోయినను మఱియొకప్పుఁడైనను, సర్వము వాసుదేవాత్మకముగనే యున్నదను పరమేశ్వర స్వరూపము యొక్క సత్యమగు జ్ఞానము మనుజునకుఁ గల్గును. ఆ జ్ఞానముచే నతనికి ముక్తి లభించును.

జనా : మహాత్మా! భాగవతశ్రేష్ఠుఁ డెట్టివాఁడు ?

నామ : శ్లో. సర్వభూతేషు యః పశ్యే। ద్భగవద్భావ మాత్మనః
భూతాని భగవత్యాత్మ। న్యేష భాగవతోత్తమః.

శా. నీ కారుణ్యము నాపయిం గలుగుబోఁ జెం దెడ్డకాలంబు నే
నీకు న్నిశ్చలభక్తి సేయవలయున్; నీ చిత్తమే వచ్చినన్
నాకోర్కుల్ నెఱవేర్తు వాక్షణమ యత్నం బేమి లేకుండనే;
నీకై జంకను, నాకె నే వెఱతుఁ; దంట్రీ! భక్త చింతామణీ. 41

తా॥ అసలు నే నేవిధమైన ప్రయత్నమూ చేయకుండానే, ఇలా సంకల్పించు కున్నదే తడవుగా నా సర్వవాంఛలనీ తీరుస్తావు నువ్వు. నాపట్ల నీ యీ అనుగ్రహా నికి కృతజ్ఞతగా సుదీర్ఘకాలం నేను నిన్ను సేవించుకోవలసి వుంది. భక్త చింతా మణీ! నీ దయ గురించి నాకే శంకాలేదనుకో-ఎపొచ్చీ నా [బ్రతుకు+నిత్యంతలెత్తు తూండే క్రొత్త క్రొత్త కోరికలూ] గురించే నాకు భయంగా వుంది.

మ. త్వరితం బీవు నుదీప్సితార్థము ఫలింపం జేయ లేదంచు నేఁ
బరుసం బాడ నిరాశతోడ; నెద విశ్వాసంబు వీడన్; నిరం
తరమున్ నిన్ ధృతిఁ గొల్చువాఁడఁ; బ్రభుచిత్తంబెత్తఱి న్వచ్చునో;
కరుణా కుండవు, ధర్మమూర్తి వకలంకా; భక్త చింతామణీ. 42

తా॥ తలుచుకున్నదే తడవుగా నా కోరిక తీర్చకపోయినప్పటికీ-నేను నిన్ను విందించను. నిరాశ పడిపోయి నాస్తికులలో కలిసిపోను. నిత్యమూ నీ సేవలూ మానను. ధర్మ స్వరూపిడివి. మచ్చలేని మహాదాతవి. నా కోరికని మాత్రం గుర్తుంచుకో చాలు. నీకెప్పుడు తోస్తే అప్పుడే తీరుద్దువుగాని.

మ. తరువల్ల్యాదులవైన పుష్పఫలపత్రంబుల్, నదీతోయముల్,
సరిగా నక్కట కల్పునయ్య? యవి యో స్వామీ! పరాధీనముల్,
గరిమన్ భక్తిరసాభిషేచనము నేఁ గావించి యమ్లాన హృ
త్సరసీజార్పణముం బొనర్తుఁ; బరమాత్మా! భక్త చింతామణీ. 43

తా॥ ఏదో పూజ చేస్తానన్న పేరేగాని-పువ్వులూ పళ్ళూ పత్రీ అన్నీ వృక్ష లతాదులిచ్చేవేకదా! నీళ్ళన్నీ నదులనుంచి తెచ్చినవే కదా! వీటిలో నా స్వంతాని దంటూ ఏముంది? అందుకే, పరమాత్మా—నా "భక్తి" అనే జలాలలోనే నిన్ను అభి షేకిస్తాను. కల్మషరహితమైన నా "మనస్సు" అనే పద్మాన్నే నీకు అర్పణ చేసు కుంటాను.

తే. గీ. పట్టెడన్నంబు పొట్టకుఁ బుట్టకున్కి
కట్టుపుట్టంబు నొక్కటి కలుగకున్కి
కన్ను వొందక బిడ్డలు గాసిపెట్టు
నింటిలోఁ బోరు చెప్పుటః కెంతొసిగ్గు.

అదియునుగాక,

మ. ఋతుకష్టంబుల కెల్ల యోర్చి యటవి న్నెప్రొద్దు శుష్కాంగినై
సతతంబొప్పు కుటీరవాసమున నా సౌఖ్యంబుతోఁ బుత్రులు౯
బతియుం దానును గందమూలములనే భక్షించుచుం దృప్తయౌ
సతికన్నం గొఱమాలినట్టి సతికి౯ సౌఖ్యం బిఁకేమున్నదో.

పట్టణవాసినినైనను, పండితునర్ధాంగినైనను, మాయదారికృష్ణుని వలలోఁజిక్కిన మగనాలినగుట నా బ్రతుకు గహనాంతరవర్తిని యగు మునిపత్నికన్నఁ గష్టమయ్యెను కట్టా!

తే. గీ. పతియె హరియని నమ్మిన పడఁతినైనఁ
బ్రేమతో లాలనముసేసి ప్రియములాడ
నోపక, సుతులఁ బోషింప నోగిరం బొ
సఁగమిఁ గోరదే పరలోక సంగమంబు.

ఇంతకు నీ రంగఁడే కారకుఁడు. నీకు కావలసిన వన్నియు నీతఁ డిచ్చునని నన్నంపె. ఇదే వెళ్ళిచూతును. (నిష్క్రమించును.)

(యవనిక వ్రాలును.)

తృతీయ రంగకము

*[పాండురంగని గుడి]*

రాధా: (ప్రవేశించి స్వామికి నమస్కరించును) రంగా! భవభంగా!! కరుణాంతరంగా!!! నా మొఱ నాలింపుము. నన్నుఁ గృపఁ గనుము. నా పతి సర్వదా నీధ్యానమునందేలి మమ్మాదరించుట మానినాఁడు. అనాథనాథుఁడవగు నీవు మమ్ము ట్లిడుమలఁగుడుప నగునా? నీ సేవఁజేయుచుంటిని. నీ యడుగులకు మడుగులొత్తు

శా. పాముల్ గప్పలఁ బట్టి మ్రింగుగతి మా పాపంబులే వ్యాధులై,
మామేనుల్ కబళించు చుంత, విడిపింపం జాలి వీక్షింపుటల్,
మాఖేదన్ వెన రేదియో, పరులహింసల్ నీ వినోదంబులో?
స్వామీ! కావవె, యార్త రక్షుడవు గావా? భక్తచింతామణీ. 47

తా. స్వామీ! పాములు కప్పల్ని మ్రింగేటట్లుగా-మా పాపాలే వ్యాధులై మమ్మల్ని పీడిస్తున్నాయి. ఇతరుల ఇబ్బందుల్లో ఆదుకోవాలేగాని, ఇలా మా కష్టాల్ని చూసి వినోదించడం నీకు తగదు. కాపాడు.

## సానుతాప ప్రార్థనము

మ. జననీగర్భములోన నుండఁగ విదేశం బేగి పెక్కేండ్లకున్
జనుదేఁ, దండ్రిని గాంచుబిడ్డవలె, నీసంబంధమున్ ముందు నేఁ
గన కీ వేళ నెఱింగి, స్నేహభయశంకాముత్త్రపాశ్చర్యభా
జనమై విల్చితిఁ; జేరఁ దీసికొనవే సద్భక్త చింతామణీ. 48

తా. అమ్మ కడుపులో వుండగానే-పరాయి దేశాలకు వెళ్ళిన తండ్రి, తనపుట్టి పెరిగి, బుద్ధెరిగిన తర్వాత తిరిగి వస్తే, ఆ తండ్రిని చూసుకున్న బిడ్డయెలా ఆనందంతో తబ్బిబ్బయి పోతాడో-అదేవిధంగా, బ్రతుకు సగం గడిచిపోయాక యిప్పటికి నీ మహిమనీ, దయనీ, నిన్నూ పోల్చుకున్న నేను-ఒక వంక చేరువ తనం, మరోవంక భయం, నీ ఆదరణకి నా అర్హత గురించిన సందేహం,ఇన్నాళ్ళూ నిన్ను కానుకోలేకపోయినందుకు సిగ్గు-ఇన్ని భావాల నడుమ నీ అద్భుత స్పృహా వహమై కలుగుతూన్న విబిడాశ్చర్యం.

మ. జనకుం డిచ్చినసొమ్ము దుష్క్రియల వెచ్చంపెట్టి రోగార్తుఁడై;
తనుఁ ద్రోవం బతిమాలు పుత్రుగతి, బోధం బెల్ల దోషైకవ
ర్తనలం జొప్పి, మహాపరాధి నయి పంతాపించెదన్ దీనతన్;
వినుఁ గాపాడెద నోడ కుండు మను; తండ్రీ! భక్తచింతామణీ. 49

తా. తండ్రి యిచ్చిన సొమ్మంతా తప్పుడు పనులలో తగలబెట్టుకుని దరిద్రుడై, చేసిన చెడ్డ పనులవల్ల ఆరోగ్యం చెడి, చెప్పంచి రోగాలపాలై, తిరిగి తండ్రినే ఆశ్రయించి మన్నింపుకోరే కొడుకుకు మల్లే, జననాది నువ్విచ్చిన జ్ఞానాన్నంతటినీ వక్రీకరించుకుని దుష్ప్రవర్తనలతో యెనలేని అపరాధాల్ని చేసి యిప్పుడిలా నీ అనుగ్రహం కోనం చూస్తారు.

రాధా: (ఆశ్చర్యముతో) ఆఁ - వర్తకుఁ డిచ్చినాఁడా! హా! రంగా! పాండురంగా!! నీ వవధూతవు. నిష్కళంకుడవు. నీ కే పంకిల మంటును? పరాత్పరుఁడవు. నే నపరాధినిని. వ్యర్థురాలను. నా తప్పు క్షమింపుము. నన్ను మన్నింపుము. అబ్బా! నిన్నెన్ని నిష్ఠురోక్తు లాడితిని? ఎట్లు సహించితివయ్యా! దేవా!! నా నాలుక వ్రయ్యలుగాను!

ఉ. తప్పు క్షమింపుమన్న, విదితంబుగ నీ భజనామృతంబె, త
న్నెప్పుడుఁ బ్రోచునంచు మది నెన్నుచునుండు మదీయ భర్తకున్
ముప్పు ఘటిల్లునంచు నతి మూర్ఖత నిన్నటు తూలనాడితిన్
ఎప్పగిదిన్ గృపంగనెదొ! యీశ్వర! యీ కలుషంబు త్రుళ్ళగన్.

దైవమా! దాసుల తప్పు దండముతో సరియంద్రుగదా! నా తప్పు క్షమింపుము. నన్ను మన్నింపుము. నా యజ్ఞానము నేఁటితో నశించినది. జగద్రక్షకా! ఆపద్బంధూ!! నీవు తప్ప మఱెవ్వరు శరణ్యులు? అమ్మా! జనాబాయి! నీవు ధన్యురాలవు. పరాత్పరునిఁ బాండురంగనిఁ గంటివి.

జనా: అమ్మా! ఆ వర్తకుఁడు పాండురంగస్వామియా?

రాధా: ఔను, ఆతని నిజాకారమును గాంచలేకున్నను నాతని ప్రచ్ఛన్న వేషము నైనను గంటివి. నీవే ధన్యవు. అచిరకాలంబునన స్వామి నీకు సాక్షాత్కరించును. నీ జన్మము ఫలించును.

జనా: భగవత్కృప.

రాధా: మంచిది. ఇఁక మనము లోని కేగి వచనము చేతము, రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

(యవనిక వ్రాలును)

ద్వితీయాంకము సంపూర్ణము.

శా. క్షేత్రిస్వామిని జూడ కన్నె పశువుల్ చే స్త్రేయఁ బద్ధుల్లు, మా
నేత్రాదీంద్రియముల్ దురాశలను దుర్నీతిం బ్రవర్తించు, వి
శ్వత్రాణుం బరమాణురూపు, నినుఁ గాంచన్ లేక; నిర్దోషచా
రిత్రా! నన్ జెఱఁ బెట్టకే కరుణఁ; దండ్రీ! భక్త చింతామణీ. 52

తా. కామందుని కానుకోకండా చేలోపడిమేసే గ్రుడ్డెద్దుల్లాగా-విశ్వవ్యాపకుడివీ పరమాణువుకన్నా సూక్ష్మరూపుడివీ అయిన నీ ధ్యానని విస్మరించి యింద్రియ లాలసతతో లక్ష తప్పుల్ని చేశాం. పొలంకాపు ఆ గొడ్లని బందెలదొడ్లో పడేసినట్లు-నువ్వు మాత్రం మమ్మల్ని బంధించకు. ఎందుకంటే ఇప్పటికే ఇంద్రియ శృంఖలా బద్ధులం మేము. మమ్మల్ని ముక్తుల్ని చెయ్యి.

శా. నానాభంగుల దుర్మదేంద్రియ కరీంద్రంబుల్, దురాశావశా
ధీనస్వాంతములై వశంపడక వర్తించున్, సదా త్వత్పదా
లానంబం దసురాగశృంఖలలఁ జుట్టన్ వాని బంధింప, వి
జ్ఞానాంకూరవరాంకుశం బొసఁగవే; సద్భక్తచింతామణీ. 53

తా. తెగబలిసిన ఏనుగుల్లాంటి నా యింద్రియాలు సదా నన్ను దురాశా, దురూహా గమ్యాలవైపే నడిపిస్తూన్నాయి. నీ కాళ్ళు పట్టుకుంటాను. భక్త చింతామణీ-యీ ఏనుగుల్ని లొంగదీసుకునేందుకు గాను — "జ్ఞాన"మనే అంకుశాన్ని నాకు ప్రసాదించు.

మ. కలువల్, దామరపూవులున్, మడుఁగులోఁ గన్గొంచు బాలుండు లోఁ
గలలోఁ దెంచక వానికందు దిగి, మున్కల్ వేయుచందంబునం,
బలు సంసారమునందు భోగపరతన్ మగ్నుండనై, మోహవ
ల్లులఁ దొల్గొంటిని; నుద్ధరింపవె; కృపాబ్ధీ! భక్త చింతామణీ. 54

తా. దయామయా! చెఱువులో చెంగల్వలనీ, కెంచామరల్నీ చూసి-వాటి కోసం చెఱువులో దూకి—ఈత చేతకాక సతమతమయ్యే చిన్నపిల్లాడిలాగా-"కళత్ర సౌఖ్యం" "పుత్రగాత్ర పరిష్వంగ సుఖం"—యింకా యిలాటి వెన్నెన్నో ప్రలోభాలకి లోబడి, సంసారమనే సముద్రంలోకి దూకి నానాయాతన పడుతున్నాను. నన్ను ఉద్ధరించు.

కృష్ణా: రామ! రామ!! ఇంతపాప మెచ్చటనైన గలదా? హరిదాసుల కన్నమిడుటతప్పు. హరికథ లాలించుటతప్పు. మీబోంటి పావనుల దివ్యకథా సందర్శన మొనర్చుట తప్పని నామగండు నన్ను రట్టుపెట్టుచుండును. నీ కీర్తన మాలించి పరవశనై యిటకు వచ్చితిని. ఏదీ, మఱియొకసారి హరికీర్తన పాడుము. శ్రవణానందముగ వినుచు నేన యీ పిండి విసరెదను.

జనా: (౭ వ అనుబంధము)

కృష్ణా: అమ్మా! పిండియైనది. లోనికేగి పళ్ళెరమును దెమ్ము. దీని నెత్తి యిచ్చెదను. (తిరుగలి తీసి పిండి కుప్పగా నద్దుచుండును.)

జనా: చిత్తము. (నిష్క్రమించును)

కృష్ణా: ఆహా! ఏమి తరుణి భక్తిపారవశ్యము. ఏమి వనిత సత్ప్రవర్తనము.

సీ. అజన్మమాదిగ హరినామ సంకీర్త
నామృతంబును గ్రోలు నాతిమిన్న
మోక్షమార్గ నిరోధముల వీడి జగతి ని
ష్కామంబుతో నున్న కలికిమిన్న
పరులకుఁ దనకు దైవంబునకు నభేద
భావంబు గలిగిన పడఁతి మిన్న
కుసుమకోమలియయ్యుఁ గోవిద సేవ క
లరుచునుండెడు నవలాలమిన్న

తే. గీ. భక్తి హృత్పద్మమున నను బంధితునిగఁ
జేసి భావనామృతమును బోసి, పెంచి
తనకు వశ్యునిగాఁ గొన్న తరుణి మిన్న
భక్తులం దెన్న నీ జనాబాయి మిన్న.

(అదృశ్యుఁడగును)

జనా: (పళ్ళెరముతో వచ్చి) ఏదీ కృష్ణాబాయి యెక్కడ! కృష్ణాబాయి! కృష్ణాబాయి!! (నలుదిక్కులు వీక్షించి, పిష్టరాశిపై శంఖ చక్ర చిహ్నితములగు శ్రీకృష్ణుని పాదాంకములఁజూచి

మ. వికసిల్లు ప్రసవాంబులున్ ఫలదళవల్లీ ప్రౌఢశిల్పంబునుం గ
న్నుల నానందజలాప్లుతంబుల్ చొరఁగఁగన్గొంచున్; దేవ; "మాగొంటునేఁ
తల వమ్మౌఁ బ్రకటి నిట్టియద్భుతచమత్కారంబు; హా !"యంచు, నెం
జలి నీ కంజలి యొసఁగు నన్ నయిఁప దోషిన్; భక్తచింతామణీ. 58

తా. ఓ స్వామ్మీ! ఈ ప్రపంచమంతా నువ్వు చెక్కిన మహాశిల్పంలా కని పిస్తోంది. రకరకాల పండ్లు, పత్రాలు, పుష్పాలూ-అసమానమైన నీ శిల్ప ప్రౌఢిని ఆనందాశ్రు నయనాలలో తిలకిస్తూ-"ఔరా! ఇంతటి మహాద్భుత సౌందర్య మంతా మా వంటి వారి వలన నిముషం నీటయి పోతాయి కదా!" అనిదుఃఖిస్తూనే, నా నెమ్మదిలో నీకు అంజలి ఘటిస్తాను. నీ శిల్పానికి వికల్పం కలిగించే దోషినైన నన్నుమన్నించు.

శా. అజ్ఞానంబున నల్పుదుష్కృతము లెన్నైన యుండునో కానీ, నీ
యాజ్ఞ న్మీఱి, యెఱింగి చేసినవియే హా ! లెక్కకున్ మీఱె; స
ర్వజ్ఞా ! నామది నిప్పులం బొరలుచేనన్ బొక్కెడున్; మామకా
పజ్ఞల్ సైఁపవె; పాపవే వెతల; దేవా ! భక్తచింతామణీ. 59

తా. అజ్ఞానవశంగా, నాకు తెలియకుండా చేసిన తప్పులెన్నున్నాయో తెల వదు గాని: తెలిసి తెలిసీచేసిన తప్పుల్ని లెక్క పెట్టుకుంటూనే-చాలా యెక్కువై పోయాయి. దాంతో నా మనసు నిప్పులమీద నడుస్తున్నట్లుగా పొక్కులెక్కుతోంది! నా తప్పుల్నిమన్నించు. ఆ రీత్యా సంక్రమించే బాధల్నించి వుద్ధరించు.

శా. ఎన్నో పాపము లాచరించితిని నన్నేదారి రక్షించెదో ?
నిన్నే తల్లిగఁ దండ్రిగా, గురువుగా, నిక్కంపు మిత్రంబుగా
మన్నింతు న్మది; నాయఘంబులు క్షమింపన్ రానివే; యైన; నేఁ
గన్నీ రోడిక గట్టఁ గాళ్ళఁ బడితిం గా; భక్తచింతామణీ. 60

తా. లక్షపాపాలు చేశానయ్యా! వాటిల్లో యే ఒక్కటి కూడా క్షమించరానిదే! నిజమే! అయితేనేం. అవిచ్ఛిన్నధారా ప్రవాహమైన కన్నీళ్ళతో నీ పాదాలనాశ్రయిం చాను. నాకు తల్లివీ, తండ్రివీ, గురువ్వీ, స్నేహితుడివీ, బంధువ్వీ సమస్తం నువ్వే నని నమ్ముకున్నాను. భక్తచింతామణీ! నన్నుద్ధరించు.

చక్రాంచిత పాణ్యాంకములీ పిష్టరాశిపైఁ గన్పట్టుచున్నవి. తండ్రీ ఇఁక నాకుదిక్కెవరు? ఇక నాకేది తెఱవు? నాకు శ్రీహరిదర్శన భాగ్యము లభింపదా? (విచారముతో నుండును.)

నామ: (దయాశాంతవచనముల) భగవల్లీల లెఱుఁగ నేరికి శక్యము? తల్లీ!

మ. తొలిజన్మంబునఁ జేసినట్టికృషి యెంతో యంతకుఁ సాటిగా
ఫల మీజన్మమున న్గటిల్లు నది తప్పంజూడశక్యంబె? లో
కులు కష్టంబుల దూరుచుంద్రు విధినిఁ గోపంబునన్ మూఢులై
లలనా! మూర్ఖులఁబోలి చింతిలక, శ్రీ లక్ష్మీపతిం గొల్వుమీ.

కర్మవిమోచన మగువఱకుఁ దాళియుండుము. ప్రశాంతముతో హరిని ధ్యానింపుము. త్వరలో సర్వాంతర్యామి స్వస్వరూప సందర్శనా నందకందళిత హృదయారవింద వయ్యెదుగాక, రమ్ము (ఇరువురు నిష్క్రమింతురు).

(యవనిక వ్రాలును.)

ద్వితీయ రంగకము

*[నామదేవుని గృహము]*

జనా: (ఇంటిముంగిటఁ గూర్చుండి శ్రీకృష్ణనిపైఁ గవన మల్లుచుండును)

శ్రీకృ: (తాటాకులు, గంటమును జేతఁబూని వ్రాసికొనుచుండును.)

జనా: కృష్ణా! వాచామగోచరుఁడ వగు నిన్నేమని వర్ణింతు!

తే. గీ. భువనజాతములను జెఱు బొజ్జనుంచి
జీవకోటులకు న్నీవ జీవనమయి
స్వస్వకర్మామఫలముల జరుపుచుందు
పీవ, నిన్నెఱుఁగంగ వే నెంత? కృష్ణ!

కృష్ణు: (వ్రాసికొని) ఆహా! ఈ కలకంఠి వాక్సుధారసము గంగాజల ప్రవాహాగతింబఱగుచు భక్తితరంగముల నన్మూఁగఁజేయుచున్నది. ఈ కవయిత్రి నాపైనల్లు కవన మెంత కొనియాడఁదగినది! ఐహిక

శా. కించిజ్జత్వము మేలు కీ డనుపసుం గీ డెంతొ మే లంచుఁ దోఁ
పించుం; గావున మాకు నేర్పడదు కోర్వేఁ గిష్టమున్ గష్టఁ బి
లెంచన్ సర్వవిదుండవున్, హితుఁడ! వేమేమక్కఱల్ మాకుఁ బ్రా
ప్తించున్ దీర్పవె వాని నెల్లను; కృపాబ్ధీ ! భక్తచింతామణీ. 64

తా. మేం తెలివితక్కువ వాళ్ళం కావడం వలన మంచీ చెడూ నిర్ణయించుకో లేక, మంచిని చెడుగానూ, చెడునిమంచిగానూ ఎంచుకుని నానాఅవస్థలు పడుతున్నాం. అన్నీ తెలిసున్నవాడివి నువ్వు. పైగా మా శ్రేయస్సును కోరే వాడివి కూడాను. అందుకే నిన్ను ప్రార్థిస్తున్నాను-మాకు ప్రాప్తించబోయే అవసరాలేమేం వుంటాయో— వాటన్నింటిని తీర్చిపెట్టు.

శా. ఏవో పచ్చియురాని తొక్కుఁబలు లట్టిట్టంచుఁ బోరెట్టఁ, ద
ద్భావం బారసి తల్లిదండ్రులు స్వసంతానంబు నూరార్పరే ?
నా వాక్యంబు లపూర్ణ భావము, లసందర్భార్థబంధంబు; లో
దేవా ! యుల్లి మెఱింగి కావు శరణార్థిన్, భక్తచింతామణీ. 65

తా. మాటలు రాని పసిపిల్లలు- యేవేవో ముద్ద-ముద్ద-మాటలతో తమ వాంఛల్ని వెల్లడిస్తారు. నిజానికి మాటలు ఎవరికీ అర్థంకావు. అయినా, తల్లిదండ్రులు మాత్రం-ఆ "తొక్కు"మాటలనే శ్రద్ధగా పట్టించుకుని పిల్లల భావాన్ని గ్రహించి,వాళ్ళ అవసరాల్ని తీరుస్తుంటారు. అదే విధంగా- నా యీ రచనలో వుండే సమస్త భాషా లోపాల్ని సైరించి, నా కడుపులో వున్నదేమిటో కనిపెట్టి, నీయందే శరణార్థినైన నన్ను కాపాడు.

మ. ఫలవృక్షంబులఁ బండ్లుఁ, బుష్పములు పుష్పద్రుచ్ఛటన్, బైరులన్
బలుధాన్యంబులు గల్గ కుండినను, దద్భావంబు శూన్యంబ కా;
యిలలో నన్ను నవంధ్యఁ జేయఁగదవే యీశా ! భవద్దృష్టికిన్
జెలువై మొప్పగు సత్ఫలం బొసఁగి; తండ్రీ ! భక్తచింతామణీ. 66

తా. వరదరాయా! ఈ పండ్లచెట్లూ, వాటికి పండ్లు, పువ్వులూ, ఆకులూ, పొలాలూ, పంటలూ, ఇవేవీ లేకపోతే యీ భూమి గొడ్డుపోయినట్లయిపోతుంది! అందుకే ఈ తల్లికి ఇంతటి సంతతి నిచ్చావు. ఎంతోదయగలవాడివి నువ్వు తండ్రీ. భూమిని కరుణించినట్లే, నన్ను కరుణించి-నాకు సంతులేని లోటు తీర్చు. నీకుతోచిన యే సత్ఫలాన్నయినా సరే నా కడుపున కాయించి పుణ్యం కట్టుకో..

నామ : (ఉచ్చైస్స్వనముతో) కృష్ణా ! శ్రీకృష్ణా ! !
శ్రీకృ : (వెనుదిరిగిచూచి) ఓహో ! నామదేవులా !
నామ : స్వామివా రేదో నాటకమాడించుచు నాకుఁ జూపకున్నారు. ఇదియేనా ? ఉపాస్యోపాసక మర్యాద.
శ్రీకృ : ఏమియులేదు. నామదేవా ! మఱేమియులేదు.
నామ : ఔను. ఏదియు లేకుండుటనే వలలోఁ జిక్కిన చేఁపవలె నా దృక్పథమునుండి తప్పించుకొనఁ జూచుచున్నావు. మాయా నాటక సూత్రధారుఁడవు. నీవెన్ని నాటకములనైన నాడింపఁ గలవు. ఇదివఱ కెన్ని యాడించితివో ! ఇక ముందెన్ని యాడింప గలవో ! సంకల్పసిద్ధుఁడవు. నీవు తలంచినఁ గాకుండున దేది !
శ్రీకృ : నామదేవా ! నన్నుగూర్చి యీ వ్యాఖ్యానమేల ? నీ వెఱుఁగని దిచ్చట నేమియుండును ?
నామ : (మందహాసమున) మఱేముండును ? ఉగ్గుపాలతో నలవడిన చౌర్యము నే డీవు లక్ష్మీకాంతుఁడ వైనను బోవునా ? భక్త మానసాపహారీ ! ఎవని గ్రంథమునుండి యీ తాళపత్రములను దొంగిలించితివి ? పాప మా గంటమును వానిదేనా ?
శ్రీకృ : (పరిహాసముగా) ఆహా ! ఎంత చక్కఁగా గ్రహించితివి. నేను కవినైనను బద్యచౌర్యమునకుఁ బాల్పడు కాకవి ననుకొంటివా ?
నామ : (తన కీయ సైగ చేయును)
శ్రీకృ : (పరధ్యానము నటించుచుండును.)
నామ : (చదివి కన్నుల కద్దుకొని) కృష్ణా !

ఉ. ఏ మహనీయధన్య రచియించెనొ నీ పయి నిట్లు పద్యముల్
ఏ మహితాత్మపూత రచి యింపగఁ జేసెనొ నిన్నుఁ బద్యముల్
ఏమి తపంబుచేసి కనె నిట్టి కవిత్వ మహత్వసంపదన్
ఆ మహితాత్మఁగాంచ హృదయంబునఁ గోరికలుబ్బి పర్వెడున్.

శ్రీకృ : (తట్టి) నామదేవా ? అదుగో ! జనాబాయి. ఆబిడ వక్త్రపద్మమే యీ కవితా మాధురీఝరికి జననస్థానము. భక్తి పార

శా. శాఖీరాజి సుపంచులుం బడెఁ బృథక్పా పర్త్యసాన్యోన్య వి
స్తారా పేక్షమిథస్సహాయములుగా, సర్వేశ; నిర్మించి తీ
వారా ! స్థావరజంగమాత్మకసమస్తాజాండముల్ మ మ్మెటుల్
చేరెన్ స్వార్థపరత్వ ? మెంచ కది; తండ్రీ ! భక్తచింతామణీ. 70

తా. గట్టిగా గాలేస్తే అడివిలో ఆకులన్నీరాలి ఈ మట్టిలో కలిసిపోయినట్లు, "చావు" అనే ఒకే ఒక్క అవస్థద్వారా-ప్రాణికోటి కూడా మట్టిలో కల్సిపోతూవుంది. ఈ జన్మ కెటూ మోక్షం లేదులేగాని, మళ్లా యీ మానవ జన్మని త్వరగా యిప్పిస్తే - మరపురాని జ్ఞాపకాలతో - ముక్తుడినవుతానేమోనని ఆశ!

మ. వనమం దాకులు గాలిచేత బలె, విశ్వంబందు జంతూత్కరం
బనఘా ! మృత్యువుచేత రాల్పఁబడి; మన్నై పోయెడున్; మోక్షసా
ధన మీమేను వృథా నశించు నని సంతాపించెదన్; వేగమీ
తను వెత్తించిన మేలొసంగు; పరమాత్మా ! భక్తచింతామణీ. 71

తా. విశ్వపా! అడవిలో ఆకులు గాలిచేత పతితాలయినట్లే, సృష్టిలోని జంతుకోటి మృత్యువు వలన పతనమై మన్నయి పోతోంది. మోక్షనిమిత్తంగా సాధనకుపకరించే యీ గొప్పదేహం నిష్కారణంగా నశించి పోతున్నందుకు బాధపడుతున్నాను. ప్రయోజకమయిన యీ శరీరాన్ని త్వరగా తెమిల్చేయి తండ్రీ!

శా. వగ్గాలం బలె నావల న్విషయముల్ బంధించి త న్నీడ్వఁగా.
సిగ్గింతైనను లేక, సంతసిలు నా చిత్తంబు; తద్బంధముల్
వగ్గై నిత్యసుఖంబుఁ బొందుతెరువున్ జూడంగ లేకున్న; దీ
నెగ్గు న్మాన్పి, తిన్నఁజేయు మది; తండ్రీ! భక్తచింతామణీ. 72

తా. జగద్వ్యాపీ! ఆశలో - ఇంద్రియ విషయాలో - బలమైన వగ్గాలుగా మారి - తమ ధోరణికై తన నీడ్చుకు పోతూంటే - సిగ్గుమాలిన నా మనసు నంది తపడి పోతోంది. ఆ బంధాల నుంచి విడిపించి, నా మనసును స్వాస్థ్య పరచుకోవడ మెలాగో తెలియక బాధపడుతున్నాను నేను, మమ్మల్ని సరిదిద్దు స్వామీ!

శ్రీకృ : అవధరింపుము.

తే. గీ. ఉద్ధవుఁడ వీవు, కుబ్జ యీ యువిద, పూర్వ
జన్మమందు నన్ను వరించి శయ్యఁజేర్చ
మత్కర స్పర్శనము సేసి మహితగుణము
గలిగి వరమొందె నాచేతఁ గడకుఁ దాను
దన పునర్జన్మమున ముక్తి గనఁగ భక్తి.

(శ్రీకృష్ణుఁ డదృశ్యుఁడగును. తెర బ్రద్దలగును. బాలకృష్ణుఁడు, కుబ్జ, ఉద్ధవుఁడు కనఁబడుదురు.)

నామ : ధన్యోస్మి ! ధన్యోస్మి !!

తే. గీ. బ్రతుకు బంగారమయ్యె, నా వ్రతము పండెఁ
బూర్వజన్మమునందు నా పొత్తులేక
పానియింటికిం జననట్టి సంగమీఁడు
బాలకృష్ణు సందర్శన ప్రాప్తిఁజేసి.

ఆహా ! ఆ కుబ్జయే యీ జనాబాయి. ఏమీతన్వి యదృష్టము ! మఱుగుజ్జయి యుండియు మంగళాకారుని మన మాకర్షించినది. యథార్థ మంతియె.

తే. గీ. వనిత నిష్కల్మషంబైన వలపుచేతఁ
బూరుషుని వశ్యుగాఁగొని పొందుసుఖము
మెఱుఁగుపూఁతల, సొమ్ముల మఱుఁగుమందు
ల, నన్నతంపుపల్కుల, టక్కు లను, టమారి
విద్దియలఁ బొందనేర్చునె రద్దిగాక ?

శ్రీకృ : (ప్రవేశించి) నామదేవా ! ఇంకను జరుగనున్న విచిత్రమును గందము. రమ్ము. (నామదేవునితో నిష్క్రమించును)

జనా : (మూర్ఛనుండి లేచి) కృష్ణా ! కృష్ణా !! గోపాలకృష్ణా ! మురళీ కృష్ణా ! ముద్దుకృష్ణా ! పోకుము. పోకుము.

ఉ. పదిలంపై యమునతటమ్ దనర్చునరమున్, బిల్వోటులన్ విస్మృతిన్
వెదుకం బూనినవానిచందమున, నే నిజ్ఞానహీనుండ నై
హృదయాంభోజమునందుఁ దేజరిలుని న్నెం దెందొ భావింతు;నె
మ్మది నిం జూడఁగ జ్ఞానలోచనము నిమ్మా! భక్తచింతామణీ 76

తా॥ హారం మెడలోనే వుండగా, దానికోసం అన్నిచోట్లా గాలించినట్లు నా లోనే వున్న నీకోసం గుళ్ళూ, గోపురాలూ, తీర్థాలూ, క్షేత్రాలూ అంటూ యెక్కడెక్కడో వెదుకుతుంటూంటాను. దయామయా! నా లోపలి నిన్ను కనుగొనేలా చూపుని ప్రసాదించవయ్యా!

శా. ప్రాణాపాయమునందు వీడుదురు భార్యాపుత్ర మిత్రాదులున్;
ప్రాణత్యాగమునప్పుడున్ విడువ వాపద్బాంధవా! నీవు; నా
ప్రాణం బస్థిర; మంత్యవేళ నను నశ్రాంతున్, భవద్ధ్యానపా
రీణస్వాంతు నొనర్పు; మోయఘవిదారీ! భక్తచింతామణీ. 77

తా॥ ప్రాణం పోయేవేళ, ప్రేమాస్పదులయిన పెళ్ళాం పిల్లలు, సర్వత్రా సహాయకులయ్యే స్నేహితులుకూడా దూరమయిపోతారు. ప్రమాదాల్లోవున్న వాళ్ళని రక్షించడమే పనిగా పెట్టుకున్నవాడా! సరిగ్గా అలాటి సమయాల్లోనే నువ్వు మరింత చేరువవుతావు. అలాగని—చిరంజీవిత్వాన్ని కోరుకోను....ఈ దొందెకి ఈ జీవం శాశ్వతం కాదని నాకు తెల్సును. అందువల్ల నేను కోరేదేమిటంటే నా ప్రాణ ప్రయాణవేళ ఎన్ని పాపాలనైనా పోగొట్టడానికి యెడతెగని ధ్యానాన్నీ, పారీణతనీ మాత్రం అనుగ్రహించు.

మ. గెలిపింపంగదె ధర్మ మెల్లపుడు; రక్షింపంగదే దీనులన్;
గొలిపింపంగదె నీ పదాంబుజములన్; గు య్యాలకింపంగదే;
తలఁపింపంగదె నీదు ప్రేమ; మపరాధంబుల్ క్షమింపంగదే
వలపింపంగదె విన్నజన్ర మెద; దేవా! భక్తచింతామణీ 78

తా॥ సదా ధర్మాన్నే గెలిపించు. సర్వదా దీనుల ఆర్తనాదాలనువిను, వాళ్ళని రక్షించు, వాళ్ళచేత సేవించబడు, అన్నికాలాలా నీ ప్రేమనే తలుచుకోనియ్యి. నా తప్పులన్నింటినీ క్షమించు తండ్రీ! నా మనసు—సర్వకాల సర్వావస్థలో యెడతెరిపి లేకుండా నీయందే లగ్నమయ్యేలా చేయి.

రాధా : } ( పరస్పర ముఖావలోకనములతో నామె వెళ్ళిన త్రోవను
నామ : } వెళ్ళుదురు. )

( యవనిక వ్రాలును )

తృతీయ రంగకము

( నిష్కుటపవనము )

జనా : (౧౧ వ అనుబంధముతోఁ బ్రవేశించును) ( ఒక గున్న మావిని సమీపించి విభ్రమముతో ) ఏఁడీ ! శ్రీ కృష్ణ భగవానుఁడు ! (పరికించి) మోసపోతిని. ఓసీ ! తుమ్మెదా !

తే. గీ. కృష్ణవర్ణంబుదాల్చి శ్రీకృష్ణునందు
ఐక్యమును నొంద నెంచితో యది హుళక్కి
కాని మధువానునపుడును గానలోలు
కీర్తనము మాన వెంత సుకృతవు భ్రమరి !

(౧౧ వ అనుబంధముతో నొక వెదురుగుమ్మును సమీపించి) ఏఁడీ ! శ్రీకృష్ణభగవానుఁడు ! (యోచించి) అబ్బా ! ఎన్ని విఘ్నములు సమీర ! ఏదిక్కునులేని నీకింత యార్భాటమేల ? ఎంత కాలహారణ మొనర్చితివి !

తే. గీ. వెదురుసందుల జెవ్వున వీచుకతన
మురళియో యను భ్రమమున మురిసియాడి
కాదనుచు నెఱిఁగిన యంతఁ గనలి ఫణులు
మ్రింగుటుచితంబె నిన్ను సమీర కపటి !

(౧౧ వ అనుబంధముతో నిష్క్రమించును.)

నామ : } (ప్రవేశింతురు)
శ్రీకృ : }

శ్రీకృ : నామదేవా ! చూచితివా ? ఇది భక్తి ; ఈమె భక్తురాలు. ఈ జనాబాయియే పరమభక్తురాలు.

నామ : భక్తవత్సలా ! ఇఁకనైన నాబాలను గృపఁగనవా ?

కృష్ణ : (రోయుచు) ఇదుగో ! ఇచే వచ్చుచున్నది.

శా. ఆస్నంబుం, మధకంబునందు, గృహశయ్యాసనపీఠంబులం
మన్నానావిధలీలలం, దఖిలమందు న్మృత్యువే తోఁచు; నో
యన్నా! మాకు నిమేషమున్ బ్రదుక శక్యంబే స్వశక్తిన్ భువిన్?
న న్నీ వే బ్రతికింతు రే పగ లనంతా! భక్తచింతామణీ. 82

తా. అహూహ్యాకటకామయుడివైన నువ్వే-తి-నన్ను బ్రతికిస్తున్నావేగాని, లేకపోతే క్షణంకూడా బ్రతకలేను. అన్నం, నీళ్ళు, ఇల్లు, పీటలు, కుర్చీలు, మంచాలు ఒకటేమిటి—ఉచ్ఛ్వాస నిశ్వాసలతోసహా సమస్త విశ్వమూ నాకు విష తుల్యంగానే వుంది.

మ. ముల్లుతోడన్ ముల్లు పుచ్చునట్లు; కరుణాంభోరాశి; నాకీడులం
బలుమా టీవు వొలంచినాడవు మహాపత్తుల్ ప్రయోగించి; నేఁ
దెలియన్ లే కుపకార, మప్పటిమహార్తిన్ దూరితిన్ ని; న్నయో!
తులువన్, సైఁపవె నన్ను దీనజనబంధూ! భక్తచింతామణీ. 83

తా. ఒక్కొక్క—సారి నువ్వు కలిగించిన కష్టాలకిగాను—వాటి అంతర్యాన్ని తెలుసుకోలేక నిన్ను నిందించాను. ముల్లును ముల్లుతోనే తీయాలన్నట్లు—నువ్వలా చిన్న చిన్న కలతలు కలిగించి—ఎన్నెన్నో పెద్ద పెద్ద ఆపదలలో కూరుకుపోయిన నన్ను—ఆ కంతల పూతంతోనే ఒడ్డుకుచేర్చేవాడివి. అప్పట్లో ఆ నీ ఉపకారాన్ని గుర్తించలేక- అనరాని మాటలన్నాను. మా యయ్యవ్వకమా! కాస్తంత పెద్ద మనసు చేసుకుని నన్ను క్షమించెయ్యి.

శా. స్వప్నంబుల్ మొద లౌనిమిత్తములచే, స్వాప్నాదులన్, నన్నుగా
ముందే నాకు భవిష్యదర్థములచొప్పుం దెల్పు: ద ట్లౌట, ని
ట్టందుల్ రాఁగల వన్న, నిన్నెలఁకువన్ ప్రార్థించి, నీచాటులన్
మందున్ వానికిఁ గాన రాక; పరమాత్మా! భక్తచింతామణీ. 84

తా. నా అవయవాలను అదిరించి కొన్నిటినీ, కలలద్వారా కొన్నిటినీ-జరగబోయే భావి సంఘటనల్ని నాకు ముందుగానే నువ్వు ఉప్పందిస్తుంటావు. తద్వారా నేను రానున్న కాలంలో కానున్న చెడుల్ని ముందుగానే పసిగట్టి, తగు జాగ్రత్తలు తీసుకుని, తదుపరి భారం నీ మీదనే పెట్టి, నిన్నే ప్రార్థిస్తూ ఆ అశుభాలకి అందకుండా యిలా నీ చాటున కాలంగడుపుతున్నాను.

శ్రీకృ : నామదేవా ! మీ యతిథి తొడపై, మీ జనాబాయి కూర్చుండి
భోజనము తినిపింపవలెను.

నామ : అమ్మా : ఏమి నీ యదృష్టము ! స్వామివారి యభీష్టము నెఱిఁ
గితివా !

జనా : ధన్యోస్మి ! ధన్యోస్మి !!

తే. గీ. పదరజస్స్పర్శమాత్రఁ బావనము సేయు
వానియూరుతలంబు నే చాన యెల్ల
కుండు ? రససిద్ధిచే నిన్ప గుండు పసిడి
ముద్దయగుటకు సందియం బుండునొక్కొ ?

రాధా : ఆహా !

సీ. భూతకోటులనెల్ల పోషించు పురుషోత్త
మున కన్నమిడు సతి పుణ్యమేమొ !

నామ : క్షీరాబ్ధికన్యక చెలువొందు శ్రీహరి
యంకపీఠిక నెక్కు నతివ ధన్య

జనా : యజ్ఞాదికర్మల కందగారాని, శు
భస్థలినుంట నా భాగ్యముగద

నామ : ఎవ్వరెఱుఁగనట్టి యిట్టిపదవి జనా
బాయి కనుట కామె భాగ్యమేమొ !

కృష్ణ : తే. గీ. భక్తప్రహ్లాద, విదుర, శబరి, కుచేలు
రాదిగాఁగల భక్తులం దరయ మిన్న
యగుటఁ దృప్తితీర భుజింతు నమితకాంతు
చే జనాబాయి తినిపించు భోజనంబు.

నామ : కృష్ణా ! తరించితిమి. గృహమున కేగుదము రమ్ము.

( ఎల్లరు నిష్క్రమింతురు )

(యవనిక వ్రాలును.)

( తృతీయాంకము సమాప్తము )

---

శా. ఆపత్కాలమునందుఁ బోలెఁ బరమాత్మా! సర్వకాలంబులన్
నీ పాదబ్జము లస్మదీయ హృదిలో నిల్ప న్వలెం; గాని నేఁ
దేవం గాలుతు నేఱు దాఁటి, యకటా!దీఱంగనే యక్కాఱల్!
పాపిం జూ, నిమిషార్ధమేని నిను దల్పన్; భక్తచింతామణీ 88

తా. నిజం చెప్పాలంటే, ఏదైనా ఇబ్బంది కలిగినప్పుడల్లా రాముడా దేముడా అంటూ ఆదేపనిగా నిన్నెలా స్మరిస్తానో, అదే ప్రకారం ఉత్తప్పుడు కూడా నిన్నే జపించుకోవాలి. కానితండ్రీ! ఏరుదాటి తెప్పతగిలేసినట్లు నా అవసరం తీరిపో గానేనిన్ను మర్చిపోతుంటాను. రోజులో అరనిమిషం కూడా నిన్ను తల్చుకోను. కష్ట మొచ్చిందో మళ్ళా నీ కాళ్ళమీద పడ్డానికి సిద్ధమయిపోతాను. అత్యంతకృతఘ్నుడి నైన నన్ను మన్నించు ప్రభూ!

మ. నిముసం బేమఱినన్ సమస్తజగముల్ నిర్మూలమౌఁ గానఁ, బ్ర
హ్మమ; నీ తెప్పలు వాల్ప వెప్పుడును; నీ కన్యంబు నేదిక్కుఁగా
నమి; నీ భక్తుల విన్నపంబు లెవి యైనం బ్రేమ నాలించి సే
మమె చేకూర్తువు; నిన్నెగొల్చెద, మహాత్మా! భక్తచింతామణీ 89

తా. రెప్పపాటు కాలం నువ్వీ ప్రపంచాన్ని చూడకపోయావో సృష్టిసమ స్తమూ సున్నంలోకి ఎముకలేకుండా చూర్ణమై పోతుంది. అలాగని సున్నంకూడా మిగలదు, అందుకే కదా జగన్నాధా! నిత్యం అనిమేషుడివై వుండి నువ్వేదిక్కని నమ్మిన భక్తుల మొఱలని ప్రేమతో ఆలకించి తక్షణమే వారి సమస్యలను పరిష్క రిస్తుంటావు.

మ. నిదురం గల్పనచేసి, దాని వలనన్ దేహంబు, డెందంబుఁ, బ్ర
త్యుదయంబున్ సరికొత్త సత్తెడుగతిన్, దుఃఖాదులన్ సర్వదా
మది మై, చీకక యుండ, మాకు మఱ వన్మందున్‌బ్రసాదించి; తి
క్లైది నీ సృష్టి జగద్ధితార్థ మది; తండ్రీ; భక్తచింతామణీ 90

తా. ప్రభూ! నిద్ర అనేదొకటి కల్పించి, తద్వారా శారీరక మానసికాది సమస్త అలసటలనీ తప్పించి, మర్నాటి ఉదయానికల్లా నూతనోత్సాహాన్ని మాకు ప్రసాది స్తున్నావు. అదే విధంగా జననాదిగా జరిగిన అశుభాలూ, కలిగిన ఆపదలూ, పొందిన దుఃఖావమాన పరాజయాదులు వంటివి దుష్టగ్రహాల్లా నిత్యం మా మనసుల్ని పీడించ కుండా వుండేందుకే "మఱపు" అనే మందుని అనుగ్రహించావు. నువ్వేది చేసినా ప్రపంచ శ్రేషస్సుకేకదా తండ్రీ!

శ్రీకృష్ణుఁ డామె ప్రక్కమీఁదఁ గూర్చుండును. ఇరువురు భుజించు చుందురు. ఈలోపల శ్రీకృష్ణుఁడు తన యాభరణములన్నిఁటిని నామె ప్రక్కలో దాచును ).

శ్రీకృ : చాల ప్రొద్దుపోయినది. నీవు పరుండుము.

జనా : చిత్తము. (పరుండును)

శ్రీకృ : (౧౩ వ అనుబంధము) (నిష్క్రమించును)

(యవనిక వ్రాలును.)

## ద్వితీయ రంగకము

( విఠోబాగృహము )

విఠో : (శయ్యపై నిద్రించుచుండి కలవరపాటున లేచి) హా! రంగా! రంగా! అమ్మా! జనా! జనా! (శయ్యపై వ్రాలి నిద్రించు చుండును).

వీరప్ప : (ప్రవేశించి) అయ్యా! అయ్యా!

విఠో : (లేచి కూర్చుండి) ఎవరు? ఎవరు వారు?

వీరప్ప : దాసుఁడను స్వామీ! తమరేదో కలవరించుచున్నట్లున్నారు.

విఠో : అడుగో! రంగఁడు. ఇదుగో నా కన్నతల్లి జనాబాయి. అమ్మా! జనా! జనా!

వీరప్ప : స్వామీ! ఇది తమ స్వగృహము. పండరి కాదు, కోవెల లేదు. ఇవి చిత్రఫలకములు.

విఠో : (కన్నులు మూసికొని) హా! హతాశ! వీరప్పా! సత్రమున కేగుద మెవ్వరైనను మహాత్ములు, తైర్థికులు ఎందైన నా బిడ్డను గనియుందురేమో!

వీరప్ప : దేవర! తెల్లవాఱుచున్నది. వెళ్ళుదము రండు.

విఠో : (లేచి)

శా. శ్రీకాకుత్థ్సకులాబ్ధి శీతకరు, రాజీవాక్షు, ధర్మాత్ము, సీ
తాకాంతున్, భవబంధభంజను, గుణోద్దాముణ్, మహావీరు, ని

## ఉదయ ప్రార్థనము

మ. అపవేదాంధ తమోనిరాకరణ దివ్యజ్ఞాన చక్షుః ప్రదా!
భవరోగార్త మహాభిషగ్వర! జగద్బాహ్యాంతర వ్యాపకా!
రవికోటి ప్రతిమాన! నైగమ శిరోరత్నాయితాంఘ్రిద్వయా!
భువనాధార! పురాణపూరుష! స్వయంభూ! భక్తచింతామణీ. 94

తా. అజ్ఞానమనే రాత్రియొక్క చీకటిని తిరస్కరించే "ఆత్మజ్ఞాన"మనే నేత్రాన్ని ప్రసాదించేవాడా! చావుపుట్టుకలనే వ్యాధి బాధితులపాలిట అత్యున్నత వైద్య శ్రేష్ఠుడా! ప్రపంచానికి బయటా, లోపలాకూడా వ్యాపించియున్నవాడా! కోటి సూర్యులతో సమానమైన తేజోమయా! వేదాల తలలమీద వుండే మణులచే స్పృశించబడుతూన్న అడుగుదమ్ములు కలవాడా! సృష్టికి ఆధారభూతుడా! అతి పూర్వకాలంనించీ వున్నవాడా! నీకు నీవుగా జన్మించినవాడా! భక్తజనాంగుల పెన్నిధంలో చింతామణీ రత్నంవంటివాడా!

శా. చైతన్యార్క మరీచి గుప్త నిఖిలన్, సమ్యక్త్విలం బయ్యెడున్
చేతోవ్యోమతమః పరాగము; నిసి మ్లానంబు పద్మాక్షిలో
వ్రాతం, బక్షినరోజ పద్మముల పత్రాగ్రంబుల గనబ్బున్; మహా
కాతండంబున రక్ష పక్షు లెగయున్, సద్భక్తచింతామణీ. 95

తా. దేవా! చైతన్యదాయమైన సూర్యుని కిరణాల వత్తిడితో-మనోగగనాన్ని క్రమ్మివున్న చీకటిదుమ్ము విడిచిపెట్టుకపోతుంది. తెరుచుకునే కనులనే పద్మాలతో రేయంతా చిక్కుకున్న కనుపాపల తుమ్మెదలు వదులుతాయి. నాకళ్ళ గూటిలోంచి చూపులనే పక్షులు దిగంతాలకు ఎగురసాగుతాయి.

మ. తను యంత్రంబున కావహిల్లె సుఖ నిద్రా భద్ర విశ్రాంతి సా
తన సామర్థ్యము, దేవ! చేతమున నుత్సాహంబు నుల్లాస మ
ల్లౌన గూడెన్, దిన కృత్యముల్ సలిపి కో; యుష్మత్కటాక్ష ప్రభన్
గనుదమ్ముల్ వికసించె; మ్రొక్కెదం దమోహర్తా! భక్తచింతామణీ. 96

తా. చిత్రకల్పనాధురీణా! శరీరమనే యంత్రానికి సుఖనిద్రవలన విశ్రాంతి, సామర్థ్య శక్తి కలిగాయి. మనసుకు ఉత్సాహం వచ్చింది నిత్యకృత్యాలు జరుపుకునేందుకు ఉల్లాసం కలిగింది. రాత్రి కళ్ళుమూసిన మేము, భక్తచింతామణీ! నీ దయవలన ఈ ఉదయమే కళ్ళు తెరిచాము.

౪ పౌ: ఔను. ఆ పిల్ల యెప్పుడు స్వామివారిని విడిచియుండునదికాదు. నాకుఁ గూడ నా పిల్లయంటె—కొంచె మనుమానము.

౫ పౌ: కొంచెములేదు, గించెములేదు. అపహరించినదా పిల్లయె. నాకు గట్టి నమ్మకము. స్వామివారిని చూచింది. అట్టె నగలపైఁ గన్ను కుట్టింది. ఏమూలు తాళపుచేతులలో సంపాదించుకొని వెలుతురు లేకుండ పని చక్కబెట్టుకుంది.

అర్చ: ఔనౌను. ఇచ్చటికి వచ్చేవారంతా తెల్లగడ్డాలవారు, పేలపిండి వారె కాని యీలాంటి పడుచుపిల్లలు వచ్చి యింత భక్తితో నుండగ నేను చూడలేదు. మా నాయనైననుఁ జెప్పలేదు. మా తాతయైన మచ్చుకెక్కడా వ్రాసిపెట్టలే.

౩ పౌ: వచ్చిన నెందులకు వచ్చెడివారో! ఎందులకుఁ బోయెడివారో కాని, యిటువంటి పాపమెన్నడుఁ జేయలేదు. రామ! రామ!! స్వామివారి నగలే దొంగిలించుట?

అర్చ: కాకపోతె పిల్లేమిపిల్ల. పదునాఱేండ్లబాలపడుచు, పట్టుచెండు, కరగిపోసిన కడాని. ముట్టుతే మాసిపోతుంది. నిజముగా నిది యిల్లాలయితే బుద్ధిగల కొప్పు భుజము దాటదన్నట్లు పెండ్లి పేరంటము లేక, ముక్కాలు ముసలి తండ్రిని విడిచివచ్చి పడి యుంటుందా! ఎబ్బెబ్బె!

౪ పౌ: సానిముండలకన్న సంసారి రండలే మిన్న? అదంతా మీకుఁ జెప్పాలెనా! యింతకు జనాబాయిని బట్టితిమా సొమ్ములు బయలు పడ్తాయి.

పటేలు: ఆ బాల నామదేవునింట నున్న జనాబాయి యనియేనా మీ నిశ్చితాభిప్రాయము.

అందరు: (ఏకగ్రీవముగా) ఔనౌను.

పటే: సరే. వెళ్ళుదము రండు.

౧ పౌ: (ఆలించి విని) వీరుగో! నామదేవు లిటే వచ్చుచున్నట్లున్నది.

నామ: (౧౪ వ అనుబంధముతోఁ బ్రవేశించును)

మ. జనసంచారము పూర్తిగా నడఁగి, నిశ్శబ్దంబుగా నున్న వ
ర్తనమున్ మాయికుపోలికన్, విషయసంతానంబు గాఢప్రసు
ప్తిని లీనం బగురాత్రి వేళ్ల, జడ మా దేహంబు జాగ్రత్తతో
ననపాయంబుగఁ గాచినాఁడవు గదయ్యా, భక్త చింతామణీ. 100

తా॥ జనాల సంచారం లేకపోవడం వలన, యే చప్పుడూ లేని, చప్పుళ్ళని తెలుసుకోలేని-అర్ధరాత్రి-అపరాత్రివేళ-పహారాదారుడు యీ ప్రజాకోటికి యే ప్రమాదము కలగనివ్వనట్లుగానే—నిద్రాగతమైన కారణంగా మా సర్వేంద్రియాలూ కూడా తమతమ వాసనా సహితంగా విశ్రమించి—అశక్తాలుగా పడివున్నవేళ-కేవలం జడ (శవ)మైన మా శరీరాల్ని యెంతో జాగ్రత్తగా కాపాడి, ఉదయమే నిద్రలేచే అవకాశాన్ని కల్పించే నీకు-నమోనమః.

మ. చనుఁబా ల్గ్రోలిచి, తొట్లలో నునిచి, పజ్జ న్నిల్చి, జో కొట్టుచున్
గను మాయం, గను గల్గితల్లి నిసుపుం గాపాడుచందాన, భో
జనముం, దల్ప మనుగ్రహించి, పవనవర్మంబునన్ నిద్రపు
చ్చి, నిసిం గావలి గావె మాకు? గుణరాశీ! భక్త చింతామణీ 101

తా॥ తండ్రీ! చనుపాలిచ్చి, చక్కటి తొట్టెలో పడుకోబెట్టి వూపుతూ, ఎంత చక్కటి జోలపాటతో నిద్రపుచ్చి, ఆ సమయంలో కూడా, శిశువుల యోగక్షేమాలపట్ల ఓ కన్నేసి వుంచే తల్లికిమల్లేనే-నువ్వు మాకు భోజన, భాజన శయ్యాదుల్నీ, జోల పాటలాంటి గాలితాకిడినీ అనుగ్రహించి, నిద్రాముద్రితుల్ని చేసికూడా ఉపరివిధిని సూనువాడవై నిలచిన తండ్రీ! నీకివే శతకోటి నమస్సుమాంజలులు.

మ. మును నే భ్రూణము నౌచు, మాతృజఠరంబుం జొచ్చి యున్నట్లు శ
య్యను రే యెల్లను నిద్రనుండి, యుదయం బైనట్లు మేల్కాంచి; నా
కనులం బాపజగంబుఁ గన్గొనక మున్, గన్గొందు మేలొందఁ, బా
వనముల్ తావకపాదపద్మములు; దేవా! భక్త చింతామణీ. 102

తా॥ అచ్చంగా మా అమ్మ కడుపులో నేనెలా లోకజ్ఞాన రహితంగా పడివున్నానో-అలాగే ప్రతిరాత్రీ-ఇంకా పుట్టని పిండంలా నిద్రపోతాను. తెల్లవారగానే, తల్లి కడుపునుంచి అప్పుడే పుట్టినట్లుగా—అంతఃపూర్వం నేను ఎఱుగని క్రొత్త ప్రపంచాన్ని కనుగొంటున్నట్లుగా అనుభూతి చెందుతాను. ఇలా నిద్రలేస్తూనే యీ పాపిష్టి ప్రపంచాన్ని చూడలేక-నీ దివ్య పదారవిందాలనే దర్శించి ప్రణమిల్లుతూంటాను.

రాధా : లక్ష్మిని ఉరముననే ధరించియుండును. కనుకనే శ్రీవత్సాంకు డని బిరుదు.

జనా : మహాపతివ్రతయైన తులసియే లక్ష్మీతులసిగా జన్మించిన భగవానుఁ డనుగ్రహింపఁడా!

రాధా : అమ్మా! యీదండను సమకూర్చుము. చంటివాఁ డేడ్చుచున్నాడు. సముదాయించి వచ్చెదను. (నిష్క్రమించును.)

జనా : తరించితిని (పూలను గ్రుచ్చుచు) కృష్ణా!

మ. సుమనః పుష్పము, హస్తపంకజము, హృత్పూనంబు, నేత్రాబ్జముల్
మిము సేవింపఁగఁ దగ్గపుష్పములు, భూమీజోత్థ పుష్పంబులే
ల? మనోనాయక! భక్తిసూత్రమున, మేల్ రాణించు మద్గాత్రదా
మ మురం బుంచు సిరింబలెన్ సతము నన్ మన్నించి భక్తప్రియా!

[హారమును గైకొని నిష్క్రమించును.]

(పశేలు, పౌరులు, అర్చకుడు, నామదేవులు ప్రవేశింతురు.)

నామ : జనాబాయి!

జనా : (ప్రవేశించును)

పశేలు : అమ్మా! సన్న్యాసినివలెఁ గనఁబడు నిన్నపరాధినిగా భావించు నా విధికి మన్నింపుము.

జనా : హా! పాండురంగా!

రాధా : (ప్రవేశించును)

పశేలు : అమ్మా! స్వామివారి నగలు పోయినవను గగ్గోలు మీ రెఱుఁగియే యుందురు. అందు మిమ్ము దోషిణిగా గ్రహించితిమి. దీనికి మీ రేమందురు?

జనా : ఆ! ఆ!! నే నేమియు నెఱుఁగను. పాండురంగా! నన్నేల నిందల పాల్జేతువు?

పశేలు : భటులారా! మీ రీ గృహమును శోధింపుఁడు.

భటులు : చిత్తము. (ఇల్లంతయు వెదకి యొక బొంతలోనున్న స్వామివారి యాభరణములను దెత్తురు. కొందరు కోపోద్దీపితు లగు

మ. తెలవారెన్ ; గను చూడఁగల్గె; నయినన్ దేవా! జగంబంతటం
జలదచ్ఛన్న వళఃకుహూరారజని నేచందం బటుల్, ముందు వె
న్కల నే మున్నది గాన రాదు; నను నంధప్రాయు, భద్రంబు గా
మెలఁగింపంగదె సాయమై యెపుడు; సామీ ! భక్తచింతామణీ. 106

తా. తండ్రీ ! నీ దయవల్ల తెల్లవారింది. మా కళ్ళు తెఱచుకున్నాయి. సర్వాన్నీ చూడగలుగుతున్నాం. అయినప్పటికీ—ప్రావృణ్మేఘాలు క్రమ్మేసినట్లుగా ఆకాశం—చీకటి తనాన్ని విడవలేదు. ఇదేదో దుర్దినంలా ఉంది. తెల్లవారినా, కళ్ళు తెరిచినా, అవి చూడగలుగుతూన్నా—భూతభవిష్యద్వర్తమాన కాలజ్ఞానాన్ని కోల్పోయాను. ముందు వెనుకలు తెలుసుకోలేని మూర్ఖుణ్ణి, అంధ సర్పశుణ్ణి అయిన నన్ను-తగుపాటి జాగరూకతతో మెలిగేలాచేయి.

## సా యం ప్రా ర్థ న ము

శా. భావాతీత ! భవాబ్ధిపోత ! కరుణాపారీణ ! దీనావనా !
సేవాప్రీత ! పరాత్పరా ! శుభకరా ! చిద్రూప ! సర్వేశ్వరా !
దేవా ! నిత్య ! నిరామయా ! నిరూపమా ! దివ్యాద్భుతప్రాభవా !
జీవాధార ! ముముక్షుహృత్పుటనివాసీ ! భక్తచింతామణీ. 107

తా. ఊహించడానికి అందనివాడా ! జనన మరణమయ సముద్రాన్ని తరింప చేయగలిగిన పడవా ! కరుణకి కాలువయినవాడా ! దీనుల్ని రక్షించేవాడా ! సేవల చేత సంతుష్టుడవయ్యేవాడా ! పరులనబడే దేవతలకే పరదైవమయినవాడా ? శుభాలు కలిగించేవాడా ! చిత్తమే రూపంగా గలవాడా! సమస్తానికీ యజమానీ ! దివ్యుడా ! నాశనం కానివాడా ! యే బంధాలూ లేనివాడా ! దేనితోటీ పోల్చలేనివాడా ! గొప్పదీ, ఆశ్చర్యకరమూ అయిన ప్రభావం కలవాడా ! జీవులందరికీ అధార భూతుడా ! మోక్షాన్ని కోరే వారి మనసులనే పుటలలో మసలేవాడా !

మ. కొఱఁకు ల్మాని కులాయకూలములు పుల్గు ల్సోవె, మామాపనుల్
దెఱపిం జేసుక, నీయనుగ్రహముకల్మిం జేరుకొన్నార మి
త్తఱి మాగీములు; నేఁటిమానడతలం దప్పొప్పు లే మున్నవో,
యెఱుఁగే నీ, కపరాధముల్ సయిఁపు; తండ్రీ ! భక్తచింతామణీ. 108

తా. జగన్నివాసా ! వేట విరమించి పక్షులు గూళ్ళకు చేరినట్లుగానే, మేము కూడా నేటికి మా పనులు ముగించుకుని, నీ దయవలన, యాదీపాలెట్టే వేళకు మామా ఇళ్ళకు చేరుకున్నాము. ఈ రోజు మా ప్రవర్తనలలోని తప్పొప్పులన్నీ నీకు తెలుసు. తప్పుల్ని మన్నించు.

పఠేలు : (ఎగతాళిగా) భేష్ (కోపముతో) ఈ టక్కులనుమాని నిక్కము వక్కాణింపుము.

౧ పౌ : ఈమె కెవరైనను రాత్రి తెచ్చియిచ్చిరేమో విచారింపుఁడు.

రాభా : (రోషముతో) ఈమె కెవరు తెచ్చి యిత్తురు ? అట్టితరులిచ్చుటకు నీమె పుచ్చుకొనుట కేమైన నవకాశముండునా ? అసంబద్ధ ప్రలాపములను ప్రేలకుఁడు.

౨ పౌ : ఏమో ! ఆమె చక్కఁదనానికి మీ దారిద్ర్యానికి దయదలఁచి యెవరైన నిచ్చిన నిచ్చియుండవచ్చును.

పఠేలు : సంసారులయం దిట్లు భావింపరాదు.

౩ పౌ : అయ్యో ! ఇందు విపరీతమేమున్నది ?

తే. గీ. ధనమునకొ, తరుణికొ, కాక, తన ప్రయోజ
నం బొకింతయుఁగోరక, న్యాయబుద్ధిఁ
బరుని కుపకృతి సేయఁగ, బరునితోడ
నేస్తమొనరింపఁగోరు చేదస్తుఁడెవఁడు ?

పఠేలు : జనాబాయి ! ఇనుమును గూడిన యింగలమునకు సమ్మెటపెట్లబ్బినట్లు నీ మూలమున నీ పుణ్యదంపతు లిడుమలఁ గుడుచుచున్నారు. సత్వర మొక్కని పేరు చెప్పిన నీకు ముక్తి దొరుకును.

జనా : ధర్మాధికారు లధర్మవర్తనులు గానిచో నిది కలికాల మెట్లగును?

పఠేలు : నామదేవా ! మేమీమెను గొంపోయి తగిన విధిని శిక్షించెదము. మీరేమియు భయపడ వలదు.

నామ : హరిభక్తుఁ డెవరికి భయపడవలెను ? నీకా ? లోకులకా ? లేక సత్యాసత్య విచక్షణలేని నీబోఁటి యుద్యోగాంధకారాయత్త ప్రమత్తచిత్తులకా ? సత్యమునకు వెఱవవలయును. ధర్మమునకు భయపడవలె. కాని, పాపభీతిలేని కలుషాత్ముల కెవఁడు జంకును ?

పఠేలు : (కోపముతో) భటులారా ! యీపూట కీమెను గారాగృహబద్ధను జేసి, సాయంత్రమున వధ్యభూమికిఁ దోడితెండు. (నగలను

మ. ఇను నస్తాద్రికిఁ బంపి, చీకటిని పై కెక్కించి తమ్మున్ మొగి
డ్చినలా, గీనిసి తెల్విఁ దోలి, నిమరం జేపట్టి రప్పించి, నా
కనుల న్మూయుదు; నీకుఁ గాలవికృతుల్ గా వెన్నఁడుం; గానఁ బ్రే
మను గాపాడవె నన్ను రేయి; పరమాత్మా! భక్తచింతామణీ. 113

తా. సూర్యుణ్ణి పశ్చిమదిశకు పంపించి, చీకటిని ఆకాశానికెత్తి, తామరపూవుల్ని ముకుళింప చేసినట్లుగానే - నా సమస్తమైన స్పృహల్ని అదిమి - కాలం నా కళ్ళకు నిద్రలో ముంచుతోంది. భక్తచింతామణీ! సూర్యుడు చంద్రుడుకన్నా ఎత్తయిన స్థానంలోవున్న నీకు - నాలాగా కాలానుకూలమైన వికారాలుండవుగాబట్టిదయామయుడవై - ఈ రాత్రి స్పృహారహితుడనై నిదురించే నన్నుకాపాడు.

మ. వెలుఁగున్, జీఁకటి, నీకు నొక్కటియ మూవే; పిల్లికే చీఁకటిన్
తెలియం జాలినకన్ను లిచ్చితివి; తండ్రీ! నీకు లేకుండునే?
నలు పైనం గనవచ్చుఁ జీఁకటిని, గొండ న్మించి; నీకంటికిన్
గలదే మాటు? మనంబె చూచెదు గదన్నా! భక్తచింతామణీ. 114

తా. రాత్రిపగలుకూడా సమానంగా చూడ గలిగిన (సూర్యచంద్రులు) కళ్ళు నీవి. పిల్లిలాటి అల్పజీవికే—చీకట్లో చూడగలిగిన కళ్ళనిచ్చిన మహాత్ముడివినువ్వు. ఎంత చీకట్లోనయినా - చిన్నినలుసునయినా కనిపెట్టగలవు. పర్వతాలనడ్డు పెట్టుకుని చేసిన పాపాలయినా గుర్తించగలవు. మాకే సంపూర్తిగా తెలియని మా హృదయాలనే తెలుసుకోగల మహత్తత్త్వా! నీకిదే నమస్కారం.

మ. పరదేశంబున కేగుచున్ జనుఁడు, యావద్వస్తు సామగ్రియున్
బరమ స్నేహితుచేతి కిచ్చి చను విశ్వాసంబుచే; నట్లు ని
ద్దుర వో నుండిననేను, నా తెలివియున్, స్థూలంబు, సూక్ష్మంబు నీ
కరమం దుంచితిఁ; జింత లేదు మది కింకన్; భక్త చింతామణీ. 115

తా. పరాయి దేశాలకు పోయేవాడు-తన వస్తుసామానుల్ని యింటి తాళాల్ని ఎంతో నమ్మకంతో ప్రాణమిత్రుడికిచ్చి వెళ్ళేటట్లుగానే, అత్యంత విశ్వాసంతో నేను నా తెలివిని, అంతస్తునీ, దేహాన్నికూడా నువ్వు కాపాడతావనే ధైర్యంతో, నీ చేతుల్లో పెట్టి హాయిగా నిద్ర నుపక్రమిస్తున్నాను. ఇంక నాకే బెంగాలేదు.

# భక్త జనాబాయి

## పంచమాంకము

---

ప్రథమరంగము

(వధ్యభూమి)

(శృంఖలాబద్ధయగు జనాబాయిని భటులు గొనివత్తురు.)

జనా: కృష్ణా! కృష్ణా!! నే నేమి యపరాధ మొనర్చితిని! నా కీ ఘోర శిక్షయేమి? నే ననపరాధను. అబలను. అనన్యసహాయను, నీవే దిక్కు. రంగా! రంగా!! నా కేల యిట్టిగతి గల్పించితివి? ఆబాల్యము నీ సంకీర్తనామృతమును గ్రోలుచుండినందులకా? యీ యకాలమరణము! లేక నీ భక్తారాధనము నిరంతరము సల్పుచుండినందులకా? కాక, నా మొఱలు నీ స్వేచ్ఛావిహారము నకు భంగము గల్గించుననియా? లేక నే నర్థార్థినై ధనధాన్య ముల నాసించి నిను బీడించుచుంటిననియా? స్వామీ? నీ వెఱు గవా నా హృదయము? నీ వేల సాక్ష్య మొసఁగవు? దీన బంధూ! దయాసింధుఁడవే. ఈ దీనురాలిపై నింత దయారసము చిమ్మరాదా? సాయంసమయ మయినదాది నీ భోజనమునకై పదార్థములఁ బచించితి. నీకు వడ్డించితి. నీకుఁ దినిపించితి. కృష్ణా! కృష్ణా!! గోపాలకృష్ణా! నే నాపూట నీ ప్రసాదమును స్వీకరింప మఱచి నిద్రించుచున్న క్షుద్బాధచేఁ బరుగిడివచ్చి నా పొత్తున భుజింపఁగంటివే. భక్తత్రాణ దీక్షాబద్ధకంకణ హస్తమున నా కన్న మును దినిపించితివె? పిండి విసరుచున్నప్పుడు నా చేయి కందు నేమోయని నీవెవచ్చి విసరతివె? ఇది యంతయు నిక్కువమా? కాక, స్వప్నగత వృత్తాంతమా! బాలకృష్ణుఁడవై సాక్షాత్క రించిన నాటి కరుణాకటాక్ష మిపు డేమాయె? భక్తత్రాణుఁడ వయ్యు నా గో డేల యాలకింపవు? కృష్ణా! కృష్ణా!! రావేమి?

## ఆశీస్సు

మ. "ఫలవృక్షంబులఁ బండ్లు, పుష్పము" లటన్ పద్యంపుమత్ప్రార్థనన్
ఫలియింపించితి నీశతం బిటు రచింపం బద్యముల్; గాన నా
పలుకు న్నే నెరవేర్చ బిడ్డకిడుదున్ బ్రహ్లాదనామంబు; వ
ర్ధిలు నీచే నతఁ డెల్ల శ్రేయములఁ; దండ్రీ ! భక్త చింతామణీ. 119

తా. భక్త చింతామణీ! "ఫల వృక్షంబుల బండ్లు పుష్పము" అనే పద్యంలోని నా ప్రార్థనను సఫలీకృతం చేశావు. వంద పద్యాలను వ్రాయించుకుని - యీ శతకం ద్వారా, సప్తసంతానాలలో దయిన కవ్యాని మా అబ్బాయిని చేశావు. నేను కూడా మాట ప్రకారమే ఈ శతకుడికి "ప్రహ్లాదుడు" అని నామకరణం చేస్తున్నాను. ఈ బిడ్డ నీ వలన సమస్త శ్రేయస్సులనూ పొంది వర్ధిలుగాక!

మ. తను ఖండంగ నొనర్చుకోవలెఁ గదా, యుష్మత్ప్ర సేవన్ నరుం;
డసమర్థుండ; మహాకృతుల్ సలుపలే; నాచంద్రతారార్క మై
ల్లసిలున్; నేశత కామర ప్రసవ మాలన్ గాన్క గావించెదన్;
వసురాయగ్రథితార్పితంబు గొను; దేవా ! భక్తచింతామణీ. 120

తా. జగత్పూజ్యా! నిన్ను సేవించుకోదలుచుకుంటే ప్రాణముండగానే సేవించుకోవాలి! నేను చేతగానివాడిని, గొప్ప గొప్ప కావ్యాలను వ్రాసియివ్వలేను. సూర్యచంద్ర నక్షత్రాలున్నంత కాలమూ వర్ధిల్లాలని కోరుతూ-నేను నా "శతకం" అనే వందపద్యాల-పారిజాత సుమాల మాలను – వసురాయ (వద్దాది సుబ్బారాయ) గ్రథితార్పితంగా దీనినే స్వీకరించు.

### ఉత్తరశతకము, ఇష్టదేవతాప్రశంసనాదికము.

శా. శ్రీవిశ్వోద్గతిహేతువై; విరచవి ప్రేమంబునన్, శీతల
త్వావిర్భూతి జలంబులందు బలె, నౌష్ణ్యావాప్తి వహ్నిం బలెన్,
గావించెన్ సుఖ మెల్ల జంతువులకున్ స్వాభావికం బెవ్వఁడో,
యావేల్పు న్నిను సన్నుతింతుఁ; బరమాత్మా ; భక్తచింతామణీ. 121

తా. కల్పాంతవేళ ప్రళయజలాలలో మునిగిపోయిన ప్రపంచపునరుద్ధతికి కారకుడూ నిప్పులోవేడీ, నీటిలో చల్లదనమూ మల్లేనే దేహధారులందరికీ నైజగుణంగా ఆనందాన్నందించినవాడూ అయిన పరమాత్ముడవూ, భక్తచింతామణివీ అయిన నీకు స్తోత్రాల నర్పిస్తున్నాను.

పశేలు : (క్రోధముతో) నీ మిట్టవేదాంతమును నీ మిథ్యావాదమును గట్టిపెట్టుము. (భటులనుజూచి) మీ రీమెను నేల మొప్పుకొను వఱకు దండింపుఁడు.

భటులు : (కొరడాలతోఁ గొట్టుచుందురు)

పశేలు : ఇది తన పెంకెపట్టును విడవకున్నది. తలారీ! ఇఁక నీ పనిఁ దీర్చికొమ్ము.

తలారి : అమ్మా! ఇదో! ఒక్కనిముసంలో దేవుని తలచుకో.

జనా :

శా. శ్రీకృష్ణా! యదువంశరత్న! సకలోర్వీనాథ సంస్తుత్య! రా
ధాకృష్ణా! ఋషిహృన్నివాస! సుజనోద్ధారా! మహాధీర! ధ
ర్మాకృష్టాత్మ! మహానుభావ! భవకర్మాతీత! యోగీంద్ర! ల
క్ష్మీకాంతా! కమలాక్ష! రావె నను రక్షింపంగ భక్తావనా!

తలారి : ఉ! చాలు చాలు సిద్ధముకమ్ము!

(తలారి జనాబాయి మెడపై వ్రేటు వేయఁబోగా ఖడ్గము భస్మమగును. తెరలోఁ బెద్ద ధ్వనియగును. వెంటనే దివ్యకాంతి వెలువడును. నామదేవులు, రాధాబాయి, జనాబాయి తక్కఁ దక్కినవారెల్ల రంధులగుదురు.)

శ్రీకృ : (సాక్షాత్కరించి) జనాబాయిని బట్టుకొని (౧౬ వ అనుబంధము) పౌరులారా! ఈ జనాబాయి నా భక్తురాలు. నేనీమె చరిత జగద్విదిత మగునట్లును, భూలోకమునం దాచంద్రార్కముగా వెలయుటకు నిట్టి విషమస్థితి గల్పించితిని. పరమపావనురాలగు నీ జనాబాయిని గొల్చి ధన్యులుగండు. మీరీమెను నిర్దోషినిగా మద్భక్తాగ్రేసరగాఁ దలంచిన మీకుఁ దిరుగ నయనదృష్టి గలుగును. జనా! నీ భక్తికి మెచ్చితిని. నీజన్మము తరించె. నీ జ్ఞానము ఫలించె. నీకును నాకును నభేదము. నీకీ దేహాంతమున ముక్తి లభించును. అంతవఱకు జీవన్ముక్త వలెనే జీవిత శేషమును గడిపి, పిదప నాయం దైక్యము నొందుము. రే పిట

## ఈ శ్వ ర స్త వ ము

మ. ఒకటి న్నొకటొకఁ, డిబ్బి పెక్కిమిడి, పైకొక్కండు గన్పట్టుచి
త్రకరండం బెవఁ డోచుఁ, రోదసి నిశాంతంబున్, శరీరంబు, సం
బొక సూక్ష్మంబును, గారణం బరయ; నోహో సృష్టి! యన్నింట నుం
టు కదా లోపలి సాక్షివై; సుజనబంధూ ! భక్తచింతామణీ 125

తా. సుజనబంధూ! ఒక పెద్ద పాత్రలో చిన్నపాత్ర, అందులో మరో చిట్టి పాత్ర, దానిలో యింకో బుల్లిపాత్ర - ఈ విధంగా ఒక దానిలో ఒకట పరించిన వింత పొట్లాముల తోస్తుంది - రాత్రి వేళ ఆకాశాన్ని పరిశీలిస్తూంటే? ఇది సత్య మేనా అని తర్కించుకుంటే సత్యమేననిపిస్తూంది. ఈ శరీరం స్థూల శరీరమట, ఇందులో ఇంకో సూక్ష్మ శరీరముందట, అందులో మరో కారణ దేహం విరాజిల్లు తోందట ! ఆహా ! ఏమిసృష్టిప్రభూ నీది ! పునః బాహ్యాంతరాలన్నింటా నీవే వుం టావు కదా స్వామీ !

శా. వ్యోమంబున్ గ్రహతారకావళి, నిలం బుష్పాళిఁ, గై చేసి మున్
స్వామి ! నీవు గృహప్రవేశ మిట నేనాఁ డైతివో రోదసిన్,
నీ మహాత్మ్య మహో! యలంక్రియ యదే నేడున్ గనన్ వచ్చుఁ; దద్
ద్ధామం బరయ నిత్యశోభన; మనంతా ! భక్తచింతామణీ. 126

తా. రసరూపా! భూమిని పుష్పరాశినీ, నింగిని నక్షత్ర తోరణాలనీ కల్పించి - ఈ జగత్తులో నువ్వెప్పుడు గృహం ప్రవేశం చేశావు తండ్రీ ! ఆకాశంలో వీ అద్భుత నిర్మాణాలు మా భూమినుంచే కనుపించి ఆశ్చర్యపరుస్తూన్నాయి. ఈ లోకా లన్నీ - నీ స్వంత యింటికి చేసుకున్న అలంకారాలలా భాసిస్తున్నాయి.

మ. తవనూ లీఁగలకాళ్ళకుం దగిలి బందెం బయ్యెడుం గాని గూఁ
టను నెందుం జరలాడు చెల్దిమెయి కంటం బాన; మల్లి వోన
ర్చిన యీ లోకము నీకుఁ బాఁక దెపుడుం ; గ్రీడెంతు వీ విందు; విం
త; నసుం బోఁటికిఁ గాలిబొంగ; పరమాత్మా! భక్తచింతామణీ. 127

తా. మేధావీ! సాలీడు అల్లిన గూటి దారాలు, ఈగల కాళ్ళకు బంధాలవుతాయే గాని, ఆ గూటిలోనే చరించే సాలీడు కంటనట్లు-యీ నీ సృష్టిలోని బంధాలన్నీ మా కే తప్ప-నీ కేమి అంటనే అంటవు. నిత్యం నీ విందులో క్రీడిస్తూనే వుంటావు. నాకు మాత్రం ఇదొక పెద్ద గాలిబొండలా వుంది పరమాత్మా!

మ. జగముం బోలును, దేహమున్ గగనమే తేజస్థానమూర్ధంబు; చు
ట్లగుటం జుక్కలు దేవదేవ! భవదీయాస్థాన సింహాసన
స్థగిత ప్రోజ్జ్వలవజ్రపంక్తులని నే శంకింతు; సర్వోన్నతం
బగ నీ వుంటను గాదె వెల్గు లభియించున్? భక్త చింతామణీ. 132

తా. ప్రపంచమూ - శరీరమూ ఒకలాగే అనిపిస్తూంటాయి. రెండిటికీ ఉపరి భాగమే తేజోస్థానంగా వుంది. హే దేవదేవా-చీకటిలో కనిపించే నక్షత్రాలు నీ సింహాసనానికి పొదిగిన వజ్రశ్రేణులుగా భావిస్తున్నాను. ఎందుకంటే-అన్నింటికంటే నీవు ఉన్నతంతో వుండబట్టేకదా! మా కందరికీ వెలుగు లభించేది.

మ. విరళంబుల్ హరిచందనద్రుమము లీపృథ్విం; దృణం బెల్లచో;
నరు దెంతో కనకంబు; చౌ కినుము; మణ్యశ్మంబు లిట్లేకదా!
పరిశీలింపఁ బ్రయోజనానుసరణిం ద్వత్సృష్టి దీపించు; న
బ్బుర మీ వెంతటి బుద్ధిశాలివో! స్వయంభూ! భక్తచింతామణీ. 133

తా. ఆశ్రితమందార! ఈ భూమిమీద — మంచిగంధపు చెట్లు తక్కువగానూ గడ్డి అధికంగానూ మొలుస్తాయి. బంగారం అరుదుగానూ, ఇనుము తఱచుగానూ లభిస్తాయి. రత్నాలు తక్కువగానూ, మట్టి ఎక్కువగానూ వుంటుంది. బాగా పరిశీలించి చూస్తే, ప్రజాకోటి యొక్క అవసరాన్ని బట్టే, ఆయా వస్తువుల సృష్టి జరుగుతూన్నట్లుగా తెలుస్తోంది. ఇదెంత ఆశ్చర్యం! మమ్మల్ని సృష్టించడానికి ముందే మా అవసరాలను కూడా కనిపెట్టిన నువ్వెంతటి మేధావివో గదా ప్రభూ!

శా. రాకాశారదచంద్రచంద్రిక, మహోగ్రగ్రీష్మమధ్యాహ్నదు
ర్లోకాదిత్య సుదుస్సహాతపముఁ, గారుణ్యప్రతాపంబు లే
లోకారాధ్యున, కామహాప్రభుని నాలో నిన్ను ధ్యానింతు, మో
క్షై కావాప్తికి పాపశాంతికిని; దేవా! భక్త చింతామణీ. 134

తా. శరదృతువులో వచ్చే పూర్ణచంద్రుడి వెన్నెలా — తీవ్రమైన గ్రీష్మర్తువు మధ్యాహ్నవేళ దుర్నిరీక్ష్యమూ, లోకాలకి భరించరానిదైన సూర్యుడి ప్రతాపమూ-ఈ రెండింటినీ తన కారుణ్యారుణ్యాలుగా గలిగిన అఖిలలోకార్చితుడూ ఆ జగచ్చక్రవర్తీయైన-నిన్ను సర్వదా - మోక్షప్రాప్తికీ, పాపసంహారణకూ గాను- నా హృదయంలో ధ్యానించుకుంటుంటాను.

మ. సమయం బెక్కడఁ లేదు; పెద్దలకు రివార్త్సాహోయ్యమున్ పల్కు; లం
చము పంచం బనరాదు; గొప్ప కొల మెంచం గూడ; వొరొర! యం
త మహారాజువు నిందు వాదరమునన్ మావిన్నపం, బెల్లడం
బమ నల్పాధిపులందె తోఁచు; బరమాత్మా! భక్తచింతామణీ. 138

తా. తండ్రీ! అత్యల్పులయిన యిక్కడి మా అధికారులూ, యజమానులూ, ప్రభువులా– మా విజ్ఞాపనలనాలకించడంలో ఎన్నెన్నో భేదభావాల్ని పాటిస్తారే కావి– సర్వ సహాజగచ్ఛత్రపత్రిపైన నీవు మాత్రం–ఫలానా సమయమనిగాని, ఇత రుల మాటసాయంగాని, లంచాలో శిలలో అవి గాని, పెద్ద చిన్నా– గొప్పా అల్పా– అనే భేదరహితంగా యెప్పుడు మేం మొఱ్ఱపెట్టుకున్నా వింటావు. దీనిని బట్టి– "అల్పుని కధికారమిచ్చిన" అనే పద్యం గురుకొస్తోంది. సర్వేశుడవయిన నీ ప్రజాపాలనకు నా జోతలు తండ్రీ!

శా. ఆశాబంధము లన్ని యూడ్చి, యనురాగామ్రప్రవాళాళి నెం
తో శోభిల్ల ఘటించి తోరణముఖన్, దుష్టి న్సుధాలేపన
ప్రాశస్త్యం బొనగూర్చి, భక్తిమయదీపం బుంచుమౌనీంద్రహృ
త్కోశంబుల్ గద వాసయోగ్యములు నీకున్? భక్తచింతామణీ 139

తా. స్వామీ! సంసారాన్నిరోసి ఆశలనుకోసి విశ్వైక ప్రేమ మనే పగడాల వంటి మామిడిచిగుళ్ళ తోరణాలు కట్టి, తుష్టినే లమృతపు వెల్లలనువేసి, భక్తిమయ మైన దీపం పెట్టివుంచే మహామునుల హృదయాలనే పవిత్ర గృహాలందే నీవు సదా నివసిస్తూంటావు కదా ప్రభూ!

శా. దూడంబే యని యార్వ నాఁకటను, దోడ్తోధేను వంబా యనున్;
గూడం బాఋన వత్స మెం దరిగినన్; రూపింప నీ వానిపై
నే డెందం బిడు బుండునంచుఁ దెలుపన్ శిక్షించితో యట్లు? నీ
జాడల్ నీపనులందె చూపఋతు; వీశా! భక్తచింతామణీ 140

తా. జగతః పితరౌ! దూడ ఆకలితో "అంబే" అని అరవగానే, ఆవు "అంబా" అని అరుస్తుంది. ఆ పిలుపునందుకోగానే దూడ, తల్లిని చేరి దానినే అను సరిస్తూ వుంటుంది. అదే విధంగా నిన్ను మనస్ఫూర్తిగా పిలవడమే అలస్యంగా బదులుపలుకులానని, నీ వునికిని గుర్తించి నిన్నేవెన్నంటి వుండాలనీ ప్రపంచానికి నేర్పడానికా యీ పద్ధతిని యేర్పరచివుంటావు. నీ తత్త్వమంతా నీ సృష్టికార్య క్రమం ద్వారానే బోధపడుతున్న పరమాత్మా! నీకివే వందనాలు.

మ. తమముపై మస్తము మెల్లఁగా ముడిఁగి, శోభాహీన మాహాత్మ్యమై శే
శయ మోదేవ! త్వదంఘ్రిసంస్మరణభాస్వద్రోచిచేఁ గాక, బో
ధయుతం బై యలరారునయ్యా? పరమాత్మా! నీ కృపావీక్ష లే
కయెటుల్ సేకుఱుఁ దాదృశస్మరణవీక్షల్! భక్తచింతామణీ 144

తా. క్రమక్రమంగా చీకటి కప్పివేయడంతో ముడుచుకుపోయి, తన సొగసు కోలుపోయిన నా మనసనే తామరపువ్వు, నీ చరణస్మరణమనే సూర్యకాంతివలన మాత్రమే మరలా వికసించి, శోభించ గలుగుతుంది. కాని-అలా నిన్ను స్మరించేందుకు కూడా నీ యొక్క అనుగ్రహమే అవసరమై వుంది స్వామీ!

మ. పరమాత్మా! నిను నేమఱింపనివి సంపత్తుల్; నిసుం బ్రీతిచా
తురి నత్యాతురతఁ గాంచినదా మరిగి, యెందుం బోని దుల్లంబు; నీ
దరికిం జేరెడువారి నారయ సమర్థం బైనదే బుద్ధి; నీ
పరిచర్య న్వినియుక్తమే తనువు; దేవా! భక్త చింతామణీ. 145

తా. ప్రభూ! నేటి అతిశయం నిన్ను మఱపింప చేయలేదో, అవే నిజమైన సంపదలు. ప్రేమతోనూ-తెలివితోనూ-తెలపిలేవి తహతహలోనూ-నీ యందే లగ్నమై -నీ పై వినా యితర దృష్టిలేకుండా వుండగలిగిందే మనసు. నీ దివ్య పదాన్ని పొందే మార్గాన్ని పసిగట్టగలిగినదే బుద్ధి. నిత్యమూ నీ పూజాధ్యానజపార్చనాదులలో మునిగి వుండే శరీరం. ఇది నిజం.

మ. నిన్నే యన్నిట వేనరుండు కనునో, నీ ప్రీతికే నిచ్చలుం
బున్నెం బేపురుషుండు సల్పెడినొ, నీ మోమ్ముం గనుంగొంచుఁదాఁ
డిన్నంగా నెవఁ డాచరించునొ క్రియల్, దేవా! యతండే భవ
త్సాన్నిధ్యంబున కర్హుఁడౌను; పరమాత్మా! భక్తచింతామణీ. 146

తా. పరంధామా! ఏ మానవుడయితే సమస్తస్థావరజంగమాలందునా నిన్నే చూస్తున్నాడో-ఎవడయితే కేవలం నీ ప్రేమాభిమానాల నిమిత్తమే పుణ్య కర్మల నాచరిస్తున్నాడో-ఎవడయితే తాను చేసే ప్రతిపనిని నీ సమక్షంలో నెరవేర్చినట్లుగానే నెరవేరుస్తున్నాడో (లేదా, నిన్ను స్మరించుకునే చేస్తున్నాడో)-అటువంటి భక్తుడు మాత్రమే పరంలో నీ సన్నిధానాన్ని చేరుకునేందుకు అర్హుడౌతున్నాడు.

శా. ఎల్లన్ నీ వయి యుందు, సజ్ఞానకు నీ వెందుంగనన్ రావు; వి
ద్యుల్లేఖాయుత కోటి భాస్వర; నినున్ దోల్గిన్నులా చూచుటల్ ?
ముల్లోకంబు జడంబు; జీవమును, దన్మూలంబు నీ; వెట్టులా
కల్లాడం గల డీవు లేక పరమాత్మా! భక్తచింతామణీ. 150

తా.ఈ ప్రపంచమంతా నువ్వే నిండి వున్నప్పటికీ కూడా, అజ్ఞానికి మాత్రం -అణువంతయినా నీ దర్శనం లభ్యంకాదు. ఒకమెఱుపుని చూడడానికే బలంచాలవి ఈ తోలు కళ్ళు-కోట్లాది మెఱుపుల నిత్యకాంతితో ప్రకాశించే నిన్నెలా చూడగలవు? (చూడలేవు). నిజానికీ లోకాలన్నీ వట్టిమొద్దులు వీటిని విస్మరింప చేసే జీవానివీ, కదిలింపచేసేచైతన్యానివీ కూడా నీవే. కాని నాడు, నీవే లేకపోతే ఒక్క ఆకయినా అల్లాడగలదా?

మ. వరిముల్లింతటి పాపలోపమయి, విశ్వం బింతయుం బోలె, ని
వ్వరిముల్లింతవివేక మాత్మఁ గలవై, బ్రహ్మాండకోటుల్ సదా
పరమాణుక్రియ రోమకూపచయము మన్ వాతాయన శ్రేణిలోఁ
ఒరుగన్ భాసిలునిన్నుఁ గాన; రఘభేదీ! భక్త చింతామణీ 151

తా. బాహ్యంలో వరిముల్లంతటి (అన్నాద్భవతి ప్రాణీ, అన్నాదేవవర్ధతి, అన్నాదేవ పుణ్యామార్దంతి, అన్నాదేవ నశ్యతి) పాపమే లోపంగావడం వలనా, ఆత్మలో నివ్వరిములు (నీవార శూకవత్తన్వీ-పీతాభాస్వత్యణూపమా) కంతటి వివేకం కలువవడం వలనా మాత్రమే-అంటే కర్మచండాలత్వ, జ్ఞానచండాలత్వ వలన మాత్రమే నీ రోమకూపాలంతటి సంఖ్యగల యీ అగణనీయ బ్రహ్మండఖాండాలన్నీ కూడా నీ ముందు పరమాణువులమల్లే గాలినిపడికొట్టుకు పోతున్నాయే గాని, నిన్ను గుర్తించలేకపోతున్నాయి. సర్వపాపదమనా! దయతో వీటిని పరిపాలించు.

శా. నీ పాదంబుల కింతదూర మగుటల్, నీ చింతనం బాత్మలో
దీపంబుం బలె వెల్గకుండుటలు, నెందే నీ కనిష్టంబు లౌ
వ్యాపారంబులలోనఁ జొచ్చుటలు,దప్పన్ దేహి కున్నే దురా
పాపత్తుల్? గన రన్ని సజ్జనులు; దేవా! భక్తచింతామణీ 152

తా. నీ పాదసేవ చేయకపోవడం, సదా లో గుండెలో నీ ధ్యానదీపాన్ని వెలిగించుకోలేకపోవడం, ఏ అవస్థలోనయినా సరే నీ కిష్టంలేని కార్యక్రమాలలో పాత్ర వహించడమనేవి మాత్రమే మానవులకు కష్టనష్టాలను కలిగిస్తుంటాయి. అందువలనే సత్పురుష లెప్పుడూ కూడా అలాంటి పనులు చేయరు.

శా. కాముల్ గొందఱు క్రోధమున్ వెసఁ, నిందల్ సేయుచున్నారు ని;
న్నా సంకోచము నీవు లేఁ; దని తదీయార్త ప్రలాపంబులం
దో సర్వేశ్వర! వారి నీవు వినెదో, పుల్లంబుఁ జూ తీవు; నీ
కీసున్ రోషము నున్నె భక్తులెడఁ? చంద్రీ! భక్తచింతామణీ 156

తా. కొందఱు కొందఱు భక్తులు తమ కోరికలేవో తీరని తామసంతో నిన్ను అనేక విధాలుగా నిందిస్తుంటారు. అయినా నువ్వేమేవీ పట్టించుకోవు. వారి మనోగతమైన క్షోభని మాత్రమే గుర్తించి, నీ సహజత్వంలో వారినలా చల్లగా చూస్తునే వుంటావు.

శా. ఆహా ! నామది కెంతహాయి, పరమాత్మా ! కొండ పైఁబడ్డ, మిం
జే హేలాగతి నొడ్డి యడ్డి, పరిరక్షిం తీవు న న్నన్నయు
త్సాహం బుద్భవ మైన దాదిగను; నీ దాసాళి కెల్లన్, భవ
ద్బాహాద్వంద్వము వజ్రపంజరము గాదా ? భక్తచింతామణీ. 157

తా. మిన్నువిరిగి మీదపడినా సరే, మోచేతికడ్డంపెట్టి, దానినాపి, మమ్మల్ని కాపాడితీరతావనే నమ్మకం నీ పట్ల కలిగింది మొదలు నా ప్రాణం సుఖంగావుంది. భగవాన్! నీ సేవకులమైన మాకందరికీ నా బలీయమైన కరద్వయమే వజ్రపు పంజరంలా నిత్యవాసమై, నిఖిలమైన ప్రమాదాలనీ పరిహసింప చేస్తోంది.

శా. నా యాగంబులు కోటికొండ లయినన్, మన్నించి లోఁగొంటచే,
నీ యవ్యాజ కృపారసం బొక మహానీరాకరంబే యగున్;
స్వీయద్బాడబవహ్ని చందమున, నెన్నండైన సం దుబ్బునో
నీ యుగ్రత్వ మటంచు లో నడలుదున్ నే; భక్త చింతామణీ. 158

తా. నా దోషాలనే కోట్లాది కొండల్ని సైతం తనలో లీనం చేసేకోగలిగిన నీ దయ "అనేది — ఊహించరానంత గొప్ప సముద్రంలో అనిపిస్తుంది. కావి, ఎప్పుడయినా ఆ దయా సముద్రగర్భంలో - నా పట్ల "కోపం" అనే బడబాగ్ని వుడుటుందేమోనని కూడా, అప్పుడప్పుడూ భయంగా వుంటుంది. దయచేసి యెన్నడూ కోపించకు.

## భక్తలక్షణము

శా. సకలంబున్ విశదీకరించి పగ, లాచ్ఛాదించు సద్రూప; మ
ల్లై కడున్ లౌకికజాగరంబు, విషయాళిం దెల్పి వి న్మాటు; నిం
దుకు భిన్నంబు తమిస్ర వోలె; ననువొందున్ యోగపున్నిద్ర: యం
దె కదా తజ్ఞులు జాగరూకు; లభభేదీ! భక్తచింతామణీ. 159

మ. వినుఁ జింతించును, నిమిత్తం బెఱుఁగుచున్, నియిష్టమున్ సల్పుచున్,
దనకుం బుట్టము, పక్షమున్, మెల్లిజగములన్, వైపంబు నీవంచు, స
జ్జనుఁడై, కుమ్మరపుర్వుచందమున సంసారంబునం దుండి, ని
న్నెనయున్ భక్తుఁడు హాయిగాఁ దుదకుఁ; దండ్రీ! భక్తచింతామణీ. 163

తా. జగన్నాథా! నీ భక్తుడయినవాడు సదా నిన్నే ధ్యానిస్తూ, నీ సూచనలని గుర్తించుతూ, ఆ ప్రకారమే నడుచుకుంటూ, లినను పుట్టమైనా-పక్షమైనా-ప్రపంచమైనా- సర్వేశ్వరుడవైన నీ వొక్కడివేనని విశ్వసిస్తూ, దుర్మార్గాలు చేయకుండా వేదోక్త ధర్మాలను పాటిస్తూ వుంటాడు. కుమ్మరపురుగుమట్టిలో యెంతగా పొరిలినప్పటికీ దానికీ పంకం యే విధంగా అంటుకోదో, అదే విధంగా- నీ భక్తుడు కూడా ఈ సంసార పంకంలో నిర్లిప్తంగా మనలి, మరణానంతరం నిన్నే పొందుతాడు.

మ. నగుచున్, బాడుచు, నాడుచుం, దిరుగుచున్, నానాక్రియల్ సల్పువాఁ
డగు చున్నన్, స్వగృహం బెటుల్ దలఁచుఁ గారాగారబద్ధుం డటుల్ఁ
జగతిన్ భక్తుఁడు దేహయాత్ర రుచితో సాగించునట్లుండి, ని
న్న గలం గాఁదలపోయు నెప్డుఁ; బరమాత్మా! భక్తచింతామణీ. 164

తా. చెఱసాలలోవున్నవాడు, తోటిబందీలతోకలిసి ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ, చతురుల్నిచెప్పుతూ, యితరవిధుల్ని యెంతగా నిర్వర్తిస్తూన్నప్పటికీ, లోలోపల తన స్వంతయింటినీ-అక్కడి బంధువుల్నీ యెలాతలబోసు కుంటుంటాడో, అదే విధంగా – ఈ లోకంలో నీ భక్తుడు-దేహావసరాల నిమిత్తం కృషి మగ్నుడయినప్పటికీ, అంతరాంతరాలలో మాత్రం – అంతర్యామివైన నిన్నేసదా ధ్యానించుకుంటూ వుంటాడు.

మ. తనలోనవ్వుఁ, దనంత నాడు, గొణగున్, ధ్యానించు, గేల్మోడ్చుఁ, గి
మ్మన కుండున్, బులకాంకితాంగుఁ డగు, బాష్పాకీర్ణుఁ డౌ విశ్వసిం
చును, వెక్కున్, వెఱఁగొందు, మైమఱచు, మెచ్చున్, సచ్చిదానందమూ
ర్తివి నిన్ భక్తుఁ డజస్రమున్ మరిగి; తండ్రీ; భక్తచింతామణీ. 165

తా. హే భక్తచింతామణీ! నీ సద్భక్తుల ప్రవర్తనా పరశినేమని వర్ణించమంటావ్? తనలో తనే నవ్వుకుంటూంటాడు. తనకితానే వర్తిస్తాడు. యేవేవోగొణుగు తూంటాడు. అప్పటికప్పుడే ధ్యానంలో లీనమైపోతాడు. ఉన్నట్టుండి పట్టి శూన్యానికి నమస్కరిస్తాడు. అంతలోనే మాటల్లో చేతల్లో యేమీలేకుండా అలా వుండిపోతాడు. (చూసేవాళ్ళకి) అకారణంగా పులకాంకురుడవుతాడు. నీళ్ళునిండిన కళ్ళతో విలవిలపోతాడు. ఎందుకో వెక్కిళ్ళువెడుతాడు, యేడుస్తాడు, అన్ని

శా. నిన్నున్ భీషణ భీషణుం డనఁగఁ దంత్రీ! వింటి; నైనన్; భవ
త్సాన్నిధ్యంబున కేను రా వెఱవ; వత్సం బావుగోపైనఁ,దాఁ
జన్నానం జన కున్నె? లోన యది వాత్సల్యంబులన్ లేఁపదే?
నన్నుం గోర్కులి నిచ్చికావు; దురితఘ్నా! భక్త చింతామణీ 169

తా. ఆదేమిటోగాని యభవా! కొంతమంది నువ్వొక భయానికే భయం కలి గించేటంతటి భయంకరుడివని చెప్పుకోడం విన్నాను. అయినప్పటికీ నాకెందుకో నీ దగ్గరకు రావడానికి యేభయంగాని, జంకుగొంకుగాని వుండవు. ఎందుకంటాయి? ఆవు పోట్లమారిదేకావచ్చు. కొందరుదాన్ని సమీపించడానికి భయపడనూవచ్చు! కాని ఆ ఆవుదూడ పాలుత్రాగటానికి ఆ ఆవుదగ్గరకేవెడుతుంది. అందర్నీ జడిపించే ఆవు తు వ్వాయి (దూడ) దగ్గరకు రాగానే వాత్సల్యంతో దగ్గరకు తీసుకొని పాలనిస్తుంది. భక్తచింతామణీ! నేనూ ఆ దూడవంటివాడినే. దయతో నాకోరికలుతీర్చినన్నుకాపాడు.

శా. లావణ్యంబును జంద్రమండలమునన్; లాలిత్య మబ్జంబునన్,
శ్రావృణ్మేఘమునన్ గృపాకరస, మపార శ్రీఖని శ్రేణి ని,
ట్లీ విశ్వంబున నించు కించుక భవచ్ఛృంగార భావాదులం
దా వీక్షించి వరించె నిన్ మతి, మహాత్మా! భక్తచింతామణీ 170

తా. హే అనాహత శృంగారమూర్తి! చంద్రమండలంలో నీలావణ్యాన్నీ, తామరపూలలో నీ కోమలత్వాన్నీ, శ్రావణమేఘంలో నీ దయనీ, గనులలోనీఅయిశ్వ ర్యాన్నీ ఇలా యీప్రపంచంనిండా కొంచెంకొంచెంగా నువ్వుంచిన నీవిభూతుల్ని చూసి, నా మనసు నీయందే లగ్నమయిపోయింది. (తరువాతి పద్యంలో అన్వయం)

మ. తనుఁదా నామతి, దేవ! ని న్వలచి, సంతాపంబున న్వేఁగుటన్
గని, యన్యంబులు మాని జిహ్వ్వక, యఖండ ప్రాభవాంభద్భవ
ద్ఘనకల్యాణ గుణానువర్ణనల నోదార్చున్; త్వదాలింగనం
బున నింకన్ సుఖపారవశ్య మెపు డబ్బున్? భక్త చింతామణి 171

తా. అలా-నిన్ను ప్రేమించింది మొదలు నామనసు చెప్పరాని తాపంతో పరి తపించ సాగింది. అప్పుడు నానాలుక గొప్పవయినవీ, శుభంకరాలయినవీ యైన నీ గుణగణాలనీ వర్ణిస్తూ, నా హృదయాన్ని రవంత ఊరడించసాగింది. అయితేనేం! నామనసుకి నీ కౌగిలిలభ్యమయ్యే శుభముహూర్త మెప్పుడో కదా స్వామీ!

మ. పలికింప న్విధి లేక పల్కును బునర్భాషావకాశంబు సం
ధిల కుండం, బరమేశ! తా నఖిలము న్వీక్షించు రూపాదులన్
దెలియం జాలనిమాపునన్, స్వరములున్ విన్చుండు భేదాదిసం
జ్ఞలు దక్కన్, మతి నీకు మేలుపడి; యీశా! భ క్తచింతామణీ. 175

తా. ఎవరయినా పలకరించగా పలకరించగా-తప్పనిసరై బదులు పలుకుతాను. అదయినా, అవతల వాళ్ళకి మారుమాట్లాడే అవకాశం కలగకుండానే సుమా! అన్నిటినీ చూస్తూనేవున్నా, దేనినీ గుర్తించదు. ఏం చెప్పమంటావు తండ్రీ! నా మనసు నీ పాలబడి-అన్నిటినీ వినడమేగాని—విన్నవాటిలో తేడాను కూడా తెలుసుకోలేక పోతోంది.

మ. అవికారుం డజుఁ డద్వితీయుఁ డఖిలైకాధారుఁ డాద్యుం డశి
ష్టవినాశుం డఘమర్దనుం డనుమహాశం దారతమ్యంబు నే
నవలోకింపను గా, కయో; యువవిషత్ప్రార్థ్యుండు నా కందు నే
యవివేకక్షితి? కంచుఁ గుందు మతి, దేవా! భ క్తచింతామణీ. 176

తా. ఎటువంటి వికారాలూ లేనివాడు, జన్మమెరుగనివాడు, సాటిలేనివాడు, అంతటికీ ఆధారుడు, ఆదికారణుడు, అన్నికష్టాలనీ అంతరింపచేసే వాడూ, పాపాలను మర్దించేవాడూ కదా, అనే, గొప్ప ఆశతో నా తాహతేమిటో నేను తెలుసుకోలేకపోతున్నానేగాని, అవివేకానికి ఆధారమయిన నా పాటికి-ఉపనిషత్తుల చేత ఊడిగం చేయించుకునే ఆ ఉదారుడు లభిస్తాడా? అని, నా మనస్సు పొగిలి ప్రొద్దంటూ లేదు స్వామీ !

శా. చాలుం జాలును; నామరూపములు లేశంబైన లేనట్టి నీ
కాలాయంపడి నందు, కయ్యెఁ దగుప్రాయశ్చిత్త; మిట్టుల్ సదా
జాలిం గూరి, స్వయంకృతాగమునఁ బశ్చాత్తాపముం బొంద నేఁ
బాలైతిన్; దుది నాకు నీగతియె దేవా! భ క్తచింతామణీ. 177

తా. చాలు చాలులే! ఎవరికయినా చెప్పకుండా మనినా-ఒక పేరూ, వర్ణించ దానికైనా ఒక ఆకారమూ లేని నీ మీద భ్రమపడినందుకు, నాకు మంచి ప్రాయశ్చిత్తమే జరిగింది! నాకునేనై చేసుకున్న అల్లరికి నేనే పశ్చాత్తాపపడాల్సి వచ్చింది. ఏం గతి కలిగించావయ్యా! భ క్తచింతామణీ !

శా. జాగ్రత్స్వప్నసుషుప్తులం గడచె శ్రేష్ఠం ! బేమి యన్నన్, మదో
దగ్రత్వంబున నొంట వెంటఁ గలుషవ్యాపారముల్ చేసి నీ
యుగ్రత్వంబున కైతిఁ బాత్రమను నే; నోదేవ ! పుత్రుల్ సదా
నుగ్రాహ్యుల్ గద తండ్రికి; కేలు దయ నన్నున్; భక్తచింతామణీ. 187

తా. దీనబంధూ! మెలకువ, కల, నిద్ర—అనే ఈమూడు అవస్థలలోనూ చివరి దైన నిద్రే శ్రేష్ఠమైనదిగా భావిస్తున్నాను. ఎందుకంటే-మొదటిరెండు అవస్థలలోనూ కూడా—అహంకారపూరితుడనై—పాపకార్యాల్ని ఆచరించి నీ క్రోధానికి అర్హుడినయి వున్నాను. దయాసింధూ! తప్పులేవిచేసినా తనయులెప్పుడూ తండ్రులకనుగ్రహ పీయులే! నన్నను గ్రహించు.

మ. అకటా ! చిన్నటనాటనుండియును జేయంబడ్డమద్ఘోరపా
తకముల్ త్రవ్వఁగఁ ద్రవ్వఁగా, హృదయగోత్రంబందు దేవా! భయా
నకభంగిం బ్రభవిల్లుశోకఝరిలోనన్ మున్గి, పూతత్వదీ
యకరాలంబము గోరునా కభయ మిమ్మా; భక్తచింతామణీ. 188

తా. చిన్నతనంనుంచీ నాచేత చేయబడి, నా హృదయక్షేత్రంలో దాచుచున్న నా పాతకాలపాతర్నితవ్వి, ఒక్కొ-క్క- పాపాన్ని ఎందుకుంటూంటే—భయంకర రీతిలో పుట్టుకొస్తూన్న దుఃఖప్రవాహంలో మునిగికొట్టుకుపోతూన్నాను. పవిత్ర మయిన నీ చేతినందించి నన్ను రక్షించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

మ. సరిచూడం బిసతంతు వెంతయును సూక్ష్మం! బంతకన్నన్ మహా
త్తరసూక్ష్మం బగు నాకుజల్గతలలో దారం; బహో! దాన న
ప్పురుషుం బోలెను, నంతకన్నను గరంబున్ సూక్ష్మమౌ నామనం
బురిగా వ్రేలుదుఁ; ద్రెవ్వ దెంత కది; యేమో? భక్త చింతామణీ. 189

తా. యదార్థానికి బిసతంతువే అతి చిన్న క్రిమి-అంతకన్నా సూక్ష్మం దాని తలలోని దారం. ఆరీత్యాచూస్తే నామనసింకా సూక్ష్మమైనది. కాని-ఇంత స్వల్పమైన బొమమైన మనసూ-కూడా-ఎంతతెంపినా తెగతంలేదు ప్రభూ!

శా. అన్నం బంచును, వస్త్రమంచు, గృహ మం, చాలంచుఁ, జాలంచు ని
ల్లైన్నోభంగుల, నెందఱో యఱతు; రే లీగోఁజు నా కంటివా,
ము న్నొక్కండవు నుండఁ దోఁపక జగంబుల్ చేసి, నేఁడిట్లు మ
మ్మన్నన్ మాఁబ్రతుకెట్లు? దిక్కెవరు? దేవా! భక్తచింతామణీ. 193

తా. స్వామి! "అన్నమనీ - వస్త్రమనీ - ఇల్లనీ - ఇల్లాలనీ — పిల్లలనీ — ఇలా అనేకమంది అనేక రకాలుగా గగ్గోలుపెడుతూనే వుంటారు. నాకెందు కొచ్చిందీ గొడవ" అంటావేమో - ఆదికాలంలో నువ్వొక్కడవే వున్నప్పుడు, యేమీ తోచక యీ సంసారాన్నిలా సృష్టించిపెట్టి, ఇప్పుడు మమ్మల్ని మాత్రం యేకాకులుగా వుండమంటే యెలాగో చెప్పు.

శా. ఏవంపుంబ్రతు కెన్నినాళు? లిఁక నా కీరాదె యారోగ్యమున్ ?
సేవల్ నీ కొనరింప, వ న్నరపి రక్షింపం బరు ల్వత్తురే?
"నావాఁ డీడెన మన్నె" యన్నయభిమానం బింత లే దాయెఁగా ?
నీవే యీవిధ మైన, నింకఁ దగ వున్నే ? భక్తచింతామణీ. 194

తా. విశ్వంభరా! ఇంకెన్నాళ్ళీ అసహ్యకరమైన బ్రతుకు బ్రతకాలి? నీసేవలు చేసుకుంటూ గడపడానికయినా నాకు ఆరోగ్యాన్నివ్వకూడదా! నన్ను రక్షించడానికి పరాయివాళ్ళు వస్తారా? (రారు). "అయ్యో! నా భక్తుడిలా వున్నాడే" నన్న అభి మానము అవగింజంత కూడా కలగడంలేదు నీకు. నువ్వే ఇలా ఉపేక్షిస్తే - ఇంక చెప్పేదేముంటుంది ?

మ. కడగండ్లం బడు చిట్లు నీ దయకు నేఁ గన్పెట్టుకొన్నాఁడ; నె
క్కడ నున్నావు? కృపాసముద్ర! మొఱ నీ కర్ణంబులన్ సోఁకదో?
పెడకర్ణంబులఁ బెట్టదో? వినివితిన్, వేసారితిన్, నోరఁ గా
యిడ కిట్లార్చినఁ బ్రోవ వేమిగతి? తండ్రీ! భక్తచింతామణీ. 195

తా. హే సర్వస్థా! అష్టకష్టాలూపడుతూ, నీ అనుగ్రహార్థినై యిలా పడివున్నా ను తండ్రీ! నువ్వెక్కడున్నావు స్వామీ! ఓ అపార కృపారసపారావారా! నా గోడు నీ చెవులకు వినబడటమేలేదా ? లేకుంటే నువ్వు నీ చెవిని నా మొరవినపడని దిశగా వుంచుకున్నావా? శ్రమగావుంది, విసుగు కలిగింది. ఓ సర్వజ్ఞా! నోరు కాయలు కట్టేలా యిలా కుయ్యోపెడుతున్నా నన్ను కనికరించవేమిటి తండ్రీ!

మ. త్రిజగన్నాయక! దీనరక్ష! భవదుద్దేశానుసారంబు నిన్
భజియింపన్ బహుసేవకుల్ గలరు; గానన్ నీ వుపేక్షించినన్,
వృజినంబుల్ విడఁ జిమ్మి ప్రోచుదొర వేఱే లేమి, నీయంఘ్రులే
బుజాభక్తిం గొలువంగ నాకు విధి యయ్యెన్; భక్తచింతామణీ. 199

తా. ముల్లోకాలకూ నాయకుడవయినవాడా! నీ ఉద్దేశ్యం ప్రకారం—నిన్ను సేవించేందుకు సవాలక్షమంది-సిబ్బందీ వుండొచ్చును. అలాగని, నాసేవల్ని నీవు స్వీకరించడం మానివేశావంటే- పాపాలవన్నింటినీ పారద్రోలి, రక్షించే వారింకెవరూ లేకపోవడం వలన—యదార్థమైన భక్తితో నీపాదాల్నే ఆశ్రయించి సేవించాల్సిన విధి నాకు కలిగింది. అనుగ్రహించు.

శా. అన్నా! యే మనుకొంటివయ్య? పరమాత్మా! యీభవంబందుఁ బా
మున్నింటం బలె నుండి భీతిలుచు, మొఱో యన్న విన్పించుకో;
వున్నారే యిఁక నార్ప దీర్ప నొక? రయ్యో! నాదుకు య్యోడు సే
య న్యాయం బగునయ్య? ప్రోవగదయ్యా! భక్తచింతామణీ. 200

తా. అయ్యో! నాపైవనూ!అసలేమిటి నీ ఉద్దేశ్యం? ఈ జన్మంతా-పామువున్న ఇంటిలో వున్నట్టుగా భయపడుతూ బ్రతుకుతూ-కేకలు పెడుతూంటే వివిపించు కోవడానికీ, ఆర్పడానికీ, తీర్చడానికీ (నువ్వు తప్ప)మరొకళ్ళెవళ్ళయినా వున్నారా? (లేరు) ఇలా నా మొఱల్ని నిర్లక్ష్యం చేయడం నీకు న్యాయమేనా? (కాదు.) నన్ను రక్షించుతండ్రీ!

శా. నాపై రాదు భవత్కటాక్ష మిఁక నైనన్ న్యాయమా? రక్షకా!
నీపాలం బడనో? నినుం గొలువనో? నీవాఁడఁగానో? యొరుల్
ప్రాపున్నారొ? యెఱుంగవో? మఱతువో? ప్రాల్మాలియుందో గదే?
తాపం బగ్గల; మార్పరావె; పరమాత్మా! భక్తచింతామణీ. 201

తా. కాపాడేవాడా! నిన్ను స్మరించలేదా! నిన్ను ఆరాధించలేదా? నీభక్తుడివి కానా? పోనీ నాకింకేమైనా ఇతరమైన అండదండలున్నాయా? నా పరిస్థితి నీకు తెలియదా? మర్చిపోయావా? పరధ్యానంగా వున్నావా? ఓ నాసర్వరక్షకా! ఇంకా నా మీద నీ దయరాకపోవడం న్యాయమేనా? (కాదు). ఓ పరమాత్మ! సత్వరమేవచ్చి—నా తాపాన్ని పరిహరించు.

శా. కొండెక్కించితి; కూలఁద్రోయకు కృపాకూపార! గాపాడుమా;
తండ్రీ! త్వద్వరదాన శాసనశిలాస్థైర్యం బజస్రంబు గ
గ్గొండుంజాల్మిఁ, గ్రహోడుపంక్తులఁ గడున్ శోభిల్లువ్యోమంబునన్;
బెండుం జేయకె ధైర్యపర్యంతము; స్వామీ! భక్తచింతామణీ 205

తా. కరుణాసాగరా! నన్ను కొండనెక్కించావు. ఇప్పుడు కూలద్రొయ్యకు. ఒకసారి నువ్వు వరమిచ్చావంటే అది శిలాశాసనంలా చెక్కుచెదరదు. ఆకాశంలో నిరాధారంగా నీవుంచిన గ్రహతారాగణాలేవీ పతనంకాకపోవడమే నీవర ప్రధాన బలానికి గుర్తు. నీపట్ల నాకు గల కొండంత ధైర్యాన్ని బెండుచేయకు. కాపాడు.

శా. ఎన్నో ప్రాణులు పుట్టుఁ గిట్టుఁ ద్రుటిలో! నేమైన మేలున్నదే?
నిన్నుం గాననియాకుజీవనము తండ్రీ, నిష్ఫలంబే కదా!
మున్నీట న్మణులట్లు నీ గుణగణంబుల్ దేవి జీవించెదన్;
నన్నున్ ధీవరుఁ జేయవే దయ; ననంతా! భక్తచింతామణీ 206

తా. తండ్రీ! సృష్టిలో అనేక ప్రాణులు పుడుతున్నాయి. అరక్షణంలో గిడుతున్నాయి. నిన్ను తెలుసుకోలేని ఆ జీవితాలవల్ల యేమిటి ప్రయోజనం? అవన్నీ నిష్ఫలాలేకదా? అందుకే ప్రార్థిస్తున్నాను. సముద్రంలో వున్న రత్నరాశుల వంటి నీ గుణగణాలన్నిటినీ తడిమి తడిమి తట్టంకెత్తు కుంటూ బ్రతుకుతాను, తగిన బుద్ధి ప్రసాదించు.

మ. చదువుల్ నేర్చినదానికిన్ ఫలము నీచందంబు దాఁ గాంచు టే;
యదియే విద్య యవిద్య సర్వమును; విద్యాదానమున్ జేయవే;
సదయాత్మ! నిను నీకుఁ దక్కఁ దెలుపన్ శక్యంబు గా దేరికిన్;
మది శుశ్రూష యొనర్తు నీకుఁ; బరమాత్మా! భక్తచింతామణీ 207

తా. నిన్ను తెలియజెప్పేదే నిజమైన విద్య తక్కిన చదువులన్నీ అవిద్యలే, కాని, నిన్ను తెలియచేయడమనేది నీ కొక్కడికేతప్ప మరొకరెవరికీ సాధ్యంకాదు. కాబట్టి నాకు విద్యని నువ్వే ప్రసాదించు. నేను నా మనసారా నీకు సర్వోపచారాలు చేసుకుంటాను.

శా. ఎన్నో సత్ఫలముల్ ఫలించి, దివిలో నేపార రాపాదు నం
చు న్నాటించినమొక్క దుష్టలతికల్ మా జల్లి నేలంటురీ
తి, న్నానావిషయేచ్ఛ రెచ్చి పొదువన్, దీపింప కడ్డంటునా
త్మ న్నీ వెత్తవె కత్తిరించి యవి ప్రేమన్; భక్తచింతామణీ 211

తా. మంచి మంచి పండ్లుకాస్తుందని నాటిన మొక్క పూర్తిగా విషాంశభరితాలైన పుష్పలతాదులని తాచి మాత్రాకుతొడిగేటట్లు అనేకాలైన విషయవాంఛలనే లతాదులతో మూసుకుపోయి, కాంతులు చిమ్మాల్సిన నా ఆత్మజ్యోతి కొడిగట్టిపోతోంది. దేవా యీ తుచ్ఛవాంఛల్ని కత్తిరించి పారేసి నా ఆత్మను పునరుద్దీప్తం చెయ్యి.

మ. మకరందంబును గ్రోలఁ జెట్టుకొనకొమ్మం దోఁచుపుష్పమ్ము జెం
తకుఁ బోవన్ మొద లెక్కుచీమవలె, నానందామృతాస్వాదవాం
ఛకమై యాత్మ, పరాత్పరుండవగునీసాన్నిధ్యముం జేర వి
ష్ట కదంగెం బసి వట్టి, నింపు జతనంబున్; భక్తచింతామణీ 212

తా. స్వయంభువా! అల్లంత యెత్తున, చెట్టుయొక్క కొనకొమ్మల కొసలనున్న మనోహరపుష్పంలోని మకరందం మీద కాంక్షతో అక్కడికి చేరేందుకుగాను, చెట్టు మొదలునుంచీ ఆరోహణ నారంభించినట్లుగానే, "ఆనంద" మనే అమృతపానం చేయాలనే వాంఛతో, నా జీవాత్మ, పరమాత్మవైన నీ వద్దకు ఇప్పుడే ప్రయాణమౌతోంది. దయతో దీని ప్రయత్నాన్ని సఫలం చేయి.

మ. త్రుటిలో రూపఱుమర్త్యకీటముల యాక్రోధప్రసాదంబు లెం
తటి? వే మయ్యెడు వానిచేత? నవి యాత్మం దాఁకునే? నాకు నె
ప్పటికిన్ యుష్మదనుగ్రహాగ్రహములే పాటించి వర్తింపనం
తటిధైర్యాదులఁ బాదుకొల్పు; పరమాత్మా! భక్తచింతామణీ 213

తా. అమృతమయా! అరక్షణంలో అంతరించి పోయే పురుగుల్లాంటి యీ మనుష్యుల కోపతాపాలూ లెంతపాటివి? వాళ్ళ అభిమానాలతో ఒరిగేదేముంది? అలుకలతో తరిగేదేముంది? అసలివి యెంతపాటివి? వాటికి ఆత్మను తాకే శక్తి లేదుగదా! తండ్రీ నేను మాత్ర మెప్పుడూ నీయొక్క ఆగ్రహానుగ్రహాల వట్లనే భయభక్తులతో ప్రవర్తించగలిగేట పాటి ధైర్యాదిగుణాలని నాకు ప్రసాదించు విభూ.

శా. నా కీ వీశ్వర ! యే మొసంగినను, దానన్ గోడులుం గీడులుం
గా కుండం గరుణింపవే; వరద! యిక్కట్టుల్ భవత్పాదనా
శీకంబుల్ దలఁపించుఁ గాన, నవియే లె; స్సైన, నోర్వన్ధృతుల్
లే కే నిట్టులు వేఁడుకొందు నినుఁ, తండ్రీ! భ క్తచింతామణీ. 217

తా. వరదహస్తా! నువ్వు నాకు యే దనుగ్రహించినా మహాప్రసాదంగా పుచ్చుకుంటాను. ఎటొచ్చీ-అలా నువ్వునాకిచ్చిన వాటివల్ల-ఎటువంటి కష్టాలూ, గొడవ రాకుండా చూడు స్వామీ! కష్టం యెప్పుడూ నీపదకంజ స్మరణనే చేయిస్తుంది. అలాగని నా బ్రతుకులో ఆ కష్టాలశాతమే పెరిగిపోతే మాత్రం తట్టుకునేపాటి సహ నమూ-ధైర్యమూ నాకులేవు. అందుకే యిలా ప్రార్థిస్తున్నాను. అనుగ్రహించు.

శా. సామాన్యంబు విశేష మం చిరుదెగల్, సౌఖ్యార్థ మీవృద్ధి నీ
శా! మా కిచ్చివ; వందు రెండవది యెట్లైనన్ సరే గాని యా
సామాన్యంబున కేమియుం గొఱఁత రా సంకల్పమును జేయ కో
స్వామీ! యామన వెప్పు దేమఱకుమీ; సద్భ క్తచింతామణీ. 218

తా. హే నిర్వికల్పా! మా జీవన సౌఖ్యాల గమనాలు-''సామాన్యము, విశే షము'' అని, రెండు రకాలుగా మాకు యేర్పాటుచేశావు. వాటిల్లో విశేష సౌఖ్యాలు, నీ దయుంటే యిస్తావు, లేదంటే లేదనుకోగాని, మొదటిదైన సామాన్య సౌఖ్యానికి మాత్రం రవంతకూడా లోటు కలిగించే ఆలోచన పెట్టుకోకుసుమా! నా యీమనవిని యెప్పుడూ మరచిపోకు.

మ. పితవీవె గద సర్వభూప్రజలకున్; విశ్వేశ యట్లౌట నీ
మతి కారాటమ కాని, యూఱట లభింప న్నేర; దేతండ్రి స్వ
స్థత నొందున్ బధిరాంధమూకులు నపస్మారుల్ విరూపాంగు లై
నతనూజాల్ గలుగన్? సృజింప కటులన్నా ! భ క్త చింతామణీ. 219

తా. నిరంజనా! ప్రపంచవాసులందరికీ కన్నతండ్రివి నీవేకదా! అందువలన నిత్యం నీ మనసుకు ఆరాటమేతప్ప, ఊరటనేదే లభించదు. ఎందుకంటావేమో! చెవిటి, గ్రుడ్డి, మూగి, ఉన్మాద, మూర్ఛరోగ, వికలాంగుల్ని సంతానంగా కన్న తండ్రికి ఆవేదనే తప్ప ఆనందమెక్కడిది? సంతాపమే తప్ప సంతోష మెక్కడిది. దయచేసి ఇకనయినా-అటువంటి వారిని సృష్టించడం మానేయి.

శా. ధర్మం బొక్కొకచో దత్యధర్మమునకుందా నోడుఁ ! దన్మూల మా
మర్మం బీశ్వర ! నీకె కాని తెలియన్ మాబోంట్లకున్ శక్యమే ?
దుర్మార్గత్వము వృద్ధిఁ బొంద నది యెంతో సాయ మౌఁ, గావునన్
నిర్మూలింపవె దోషపోషకము; తండ్రీ ! భక్తచింతామణీ. 223

తా. నిరుపమానా ! బలవత్తరమైన ధర్మం కూడా, ఒక్కొక్కసారి మరీ అధర్మం ముందు బొత్తిగా ఓడిపోతుంది. అలా యెందుకు జరుగుతుందో నీకు తెలియాలేగాని, నావంటివాళ్ళకి తెలియదు. అయినప్పటికీ, లోకపోషకా! అటువంటి విషమ ఘటనలవల్ల - దుర్మార్గం పెచ్చు మీరే ప్రమాదంవున్న కారణంగా - దోషమాత్ర కలయిన - అధర్మాదులను అత్యవసరంగా నశింపచేయి.

మ. ఇనుమంతాఁతఱ లెంతకుం దఱుఁ గవే యీ విన్నపా లంచు లో
వినువం బో; కిఁక నొండు రెండు మనవుల్ వేవేగఁ గావించి గ్రం
థసమాప్తిం బొనరింతు; ముఖ్యములు గానన్ మానఁగాఁ జాల ; నీ
వనద్వాక్ప్రీమను వానిఁ గూడ విను మీశా ! భక్త చింతామణీ. 224

తా. నిశ్చలా! ఈ నా పద్యాలూ, విజ్ఞప్తులూ - ఇనక పాతఅల మల్లేయింతా తరగవేమిటో అని వినుకోకు, ఇంకొక్క రెండు మూడు విషయాలే వున్నాయి. అవయినా చాలా ముఖ్యమైనవి కాబట్టి చెప్పక తప్పదు. ఆ మూడు నాలుగూ ముక్కలూ కూడా చకచకా మనవి చేసేసి - పుస్తకాన్ని మూసేస్తాను. ఈ గ్రంథాన్ని ముగించేస్తాను. ఇంత వరకూ మల్లేనే — నీవు నీ సహజ వాత్సల్యంతో అవి కూడా ఆలకించు.

మ. కరణప్రజ్ఞలు దూల కుండఁగ, నొడల్ గాసిల్ల కుండంగ, నన్
మరణావేదన వొంద కుండఁగను, యుష్మద్దివ్యపాదాంబుజ
స్మరణం బేమఱ కుండ, నైహికదురిచ్ఛల్ రెచ్చ కుండన్, దుదిన్
వర కైవల్య మనుగ్రహింపఁగదె; దేవా ! భక్తచింతామణీ. 225

తా. నిరంతరా! మనసు, వాక్కు, కర్మ—అనే త్రికరణులకూ భంగం కలగకుండా—అంటే -నాకు మాటపడిపోకుండా, మనసు మచ్చేయకుండా, పనులు చేసుకోలేని పరిస్థితి రాకుండా-రాపాడు, శరీరానికి బాధకలగకుండానూ, మరణయాతనలు పడకుండానూ - అంటే, అనాయాస మరణం కలిగేలాగా అనుగ్రహించు, ఆ మరణాంతం నీ దివ్యపాదారవిందధ్యానాన్ని మఱచి పోకుండానూ, లౌకికమైన దురాశలు పెరిగి పోకుండానూ రక్షించు, మరణానంతరం శ్రేష్ఠమైన నీ కైవల్య పదాన్ని ప్రసాదించు చాలు, ఇంకేమీ కోరను.

మ. అతిసంఖ్యంబుగ నీ వొనర్చితివి బ్రహ్మాండంబు! లం దొక్కఁడీ
క్షితి; యిం దుద్భవ మౌ ననుక్షణముఁ ద్వచ్చిత్తానుసారంబు జం
తుతతుల్ కోట్లకొలఁదిఁ; గోరునెడ రాదో దివ్యచిత్తంబు? నన్
సుతభిక్షార్థి నుపేక్ష సేయకువె దాసున్; భక్తచింతామణీ. 229

తా. స్రష్టా! లెక్కించలేనన్ని బ్రహ్మాండాలని సృష్టించావు నువ్వు. వాటిలో ఒకటి మా భూగోళం. ఇక్కడ కూడా నీ సంకల్పానుసారం ప్రతిక్షణం కోట్లాది ప్రాణికోటులు కలుగుతూనేవున్నాయి. అటువంటిది, నీకు నా మీదమనసు కుదరాలే గని- నా వాంఛానుసారం ఒక్క కుమారుడిని ప్రసాదించలేవా తండ్రీ (ప్రసాదించ గలవు.)

మ. భవదవ్యాజదయామహత్వమున దేవా! లబ్ధియౌ మత్ఫల
న్నవవల్లిన్ మొనయించి రాల్తు, మది సంతాపింపఁ బూఁబిందియం
చవునే యాసలఁ బెట్టఁ? గాలిపయిఁ గంటన్ గుర్పు వేయుంజుమీ;
భువనక్షేమవిధాయి; నిల్పు సుఫలంబున్; భక్తచింతామణీ. 230

తా. తండ్రీ! యదార్థానికి నేను నువ్వు నాటిన చెట్టునేతప్ప అన్యంకాదు. నువ్వు సృష్టించిన ప్రతివృక్షాన్నీ ఫలవంతం చేశావు. అలాగే, ఈ చెట్టుకి (నాకు) కూడా ఒక కాయో, పిందోనైనా యిమ్మని ఎంత కోరినా ఇవ్వడమేలేదు. మా అయ్యవి కదూ! సంతాపలివ్వకు. సంతానమియ్యి.

మ. వరదా! యీశ్వర! త్వత్కృపావమహిమన్ బ్రహ్మోదరాహిత్యదు
ర్భర హృద్జ్వరము నేఁడు దీఱె; నిను విశ్వాసంబునం గొల్చునాఁ
డరుదా యిష్టఫలంబు గాంచుట? మహాత్మా! కొమ్ము సానందబా
ష్పరసాసేచనమత్ప్రణామ మనుకంపన్; భక్తచింతామణీ. 231

తా. వాంఛా సిద్ధికరా! నీ ప్రసాదంవలన ప్రహ్లోదరాహిత్యమనే నా భయంకరమైన బాధ నశించి పోయింది. నమ్మినిన్ను కొలిచేవాళ్ళ కోరికలు తీరడంలో ఆశ్చర్యమేముంది భగవాన్! మహాత్మా! కృతజ్ఞతా వినయయుక్తుడనై నేను సమర్పించే ఆనందాశ్రుజలాల అభిషేకాన్నీ, నమస్కారాన్నీ వాత్సల్యంతో స్వీకరించు.

మ. దొరనేరంబును మోపి బందిగమునందు ద్రొయు నే దోషినిన్,
దిరుగన్ వీడఁడు గా కశృంఖలుఁగఁ, దిండిన్ మాన్పి యెండించునే!
పరిశోధించి విధించి తీవు రుజ. యే పాపానకో శిక్షగా;
పరుగుం జేయుదె నోరు గట్టినను? దేవా! భ క్త చింతామణీ. 235

తా. సర్వాధికారీ! పాలకుడు, నేరస్తుణ్ని కొట్లోపెట్టిస్తాడు. మహాఅయితే ఆ చెఱసాల్లో కూడా సంకెళ్ళు లేనిదే అటూ ఇటూ మసలనివ్వడు. అంతే తప్ప, తిండి పెట్టడం మానేసి, యెండగట్టడు గదా! నేను చేసిన యేనాటి దుష్కర్మకో ఫలితంగా నువ్వు నాకీ "వ్యాధి"ని శిక్షగా విధించావు. ఇంతవరకూ బాగానే వుందిగాని, తినటానికి లేకుండా నా నోరుకట్టి వేశావు గదా తండ్రీ!

మ. పిల్లిం జూపుచును, బిట్టఁజూపుచును, జాబిల్లిం జడల్ చూపుచున్,
గల్లల్ బొల్లుచుఁ దల్లి బిడ్డనిడి చంకం, బువ్వఁ దిన్పించు వ
ర్ధిల్లన్ రేపుమ మాపుఁ; దల్లియును దండ్రి న్నీ వయ్యె, యోరెమం
దొల్లంబాటు ఘటిల్లున న్నరయ వేలో? భ క్తచింతామణీ. 236

తా. అయ్యయ్యా! పిల్లిని చూపిస్తూనో, పిట్టని చూపిస్తూనో, మబ్బుల్నీ-చంద మామనీ చూపిస్తూనో, యేవో వుత్తుత్తిమాటలు చెబుతూనో-తల్లిఒక్కర్తే తనబిడ్డణ్ని చంక నేసుకుని, వాడు తిననని మారాము చేస్తున్నా సరే గోముగా గోరుముద్దలు తిని పించి-దిన దిన ప్రవర్ధమానుడిని చేస్తుంది. అటువంటిది వారు తల్లీదండ్రీ ఇద్దరూను నీవేయై వుండీ కూడా-తినాలని కోరుకునే నా ఆహార విషయంలో నన్ను కరుణించ లేవా ప్రభూ!

శా. కారుంగారపుఁ జీకు పొలువిసి యే గా, కందుపై సాంద్రవీ
హారంపుం బెను వృష్టి పాతమును సౌనట్టాకరం బట్టియా
కారం బొందితి సంసృతీన్ రుజను! వేగన్, ద్వత్కటాక్షాభ నా
చో శానిష్కు రహింతు; లోక హితచక్షూ! భ క్తచింతామణీ. 237

తా. అసలే అతి నల్లటి చీకటి దట్టంగా క్రమ్మిన రాత్రి-దానికితోడు మంచు వాన అంతటితో-ముడుచుకుపోయిన తామరపూల సరోవరంలా యిలా ముసలి తనంతో పడున్నాను. [అంటే నీ పూజ చేయలేక పోయాను] అందువల్లనే ఈ వ్యాధి సంక్రమించిందేమో!-ప్రపంచానికి మేలు చేకూర్చే చూపుకలవాడా-నా పరిస్థితిని అటో-ఇటో-తేల్చివేయి. ఏ వరుణ మెలా వుంటే అలా నేను సిద్ధంగా వున్నాను.

మ. ఎడఁ బాటో, దమకంబో, పైత్యమొ! కతం బేదో! యొక ప్పెడియేఁ
గుడువం గజ్జము. వొంగెడుం గఫము; దగ్గున్, దో వగ ర్పొందునం
బొడమున్! హృద్భర మెచ్చు! నివ్వికృతులన్ బోకార్పలేఁడయ్యె వై!
ద్యుఁడయుండా ! ననుఁజేయు మీ వగదకాయున్; భక్తచింతామణీ. 241

తా. ఎడబాటో, తమకమో! పైత్య ప్రకోపమో-కారణం తెలియదుగాని, ఒక్కోసారి ఏమి తినబోయినా- కఫం అడ్డుకుంటోంది. దగ్గు వస్తోంది. అయాసం కలుగుతోంది. గుండె బరువవుతోంది. నాలో చేరిన ఈ వికారాలను ఏ వైద్యుడూ పోగొట్టలేకపోతున్నాడు. కనీసం నువ్వయినా నన్ను అనారోగ్య రహితుడిగా చేయి తండ్రీ !

మ. మకరంబున్ రవి చొచ్చుపర్వదినవున్ మాసంబు విచ్చేసె నెం
డి: కమంగొంటిని నోటికట్టువనె తండ్రీ ! యేటి పద్భాంబు లః
న్నిఁక నేవర్దెఱఁ గోగిరంబుఁ బచనం బీ వన్నటుల్ వేయు, పా
వక ! వాయుద్వయయుక్తి, మైనపిగ ! దేవా ! భక్తచింతామణీ 242

తా. పెద్దపండగ చేసుకునే-మార్గశిరమాసం వచ్చేసింది. అయినా నా నోటికి తిండియోగం లేదు. అసలు తినగలిగితే-నీయాజ్ఞప్రకారం లోపల్ని అగ్ని దానిని పచనం చేసి-నాలుగు చెరగులా పంపుతాడు. ప్రాణా పాణాలు వాటి పనివవి చేస్తాయి. శరీరం దృఢపడుతుంది. ఆ యోగాన్నియ్యి. నా ప్రాణానికి జబ్బు ప్రక్రమించి లేవడమే భారమయ్యేంత నీరసాన్ని కల్పించింది.

మ. లేవన్ భారము దోఁచునీ రసతఁ గల్పించెం, బసాదంబునం
దావంతేనియు విష్టతం బొరయ నీ, కబ్దంబునుండిన్ జెవుల్
దేవా ! యీ విషమామయంబుకడ నిష్ఫలంబు లేమందులున్ !
నీవే దీనిఁ బోకార్చి కావ వలె నన్ నే ! భక్తచింతామణీ. 243

తా. నీ ప్రసాదమైనా ఆవగింజంత నోట్లో వేసుకుందామంటే హితవు లేకుండా సంవత్సరం నుంచి యీ జబ్బు ! ఏ మందులూ పనిచేయడంలేదు. ఓ నా అనువుల కామాందా ! నువ్వే కాపాడాలి.

మ. కరుణాసాగరుఁ డన్న పేటివిరు దొక్కండుండుఁగా నీ! క దె
వ్వరు గల్గించిరి ? దేవ! మాదృశమహాపాపాత్మకుల్ గారె ? త
చ్చిరసంబంధము నెంచి యైన, నను గాసిం బెట్టురుగ్వ్యాఘ్రభీ
కరదంష్ట్రల్ పెకలించి, కాచికొను లెంకన్! భక్త చింతామణీ 247

తా. అనామహా ! నీకు కరుణా సముద్రుడివనే గొప్ప బిరుదొకటి వుండ వచ్చును గాక ! కాని, నీకా బిరుదిచ్చిన వాళ్ళెవరు ? నీచేత దయజూపబడ్డ నాలాంటి మహా పాపాత్ములే గదా ! - పోనీ - ఆ బంధుత్వాన్నయినా దృష్టిలో పెట్టుకుని, నా ప్రార్థనలు విని నన్ను బాధిస్తున్న యీ వ్యాధి అనే-పెద్దపులి కోరలని పెకలించి, నీ సేవకుడనైన నన్ను కాపాడు.

శా. కైలాసంబునకో. శిలాఘటితదక్షారామగోదావరీ
కూలస్థోన్నతగోపురావళికొ, యేమ్మ వేగ, వ్యాయామచ
ర్యాలక్ష్యం బయి, యందుఁ దచ్ఛ్రీయవిహారక్షేత్రబుద్ధిన్ మనం !
బేలా వ్యాధి వశింప దింక ? భవహారీ ! భక్తచింతామణీ. 248

తా. వ్యాయామం చేయాలనే వైద్య సూచనల రీత్యా — అటూయిటూ నాలుగడుగులు వేద్దామన్నా - నా మనసు నీ పుణ్యక్షేత్రాలైన - గోదావరీ తీరస్థ ద్రాక్షారామానికో- శృంగరాజమైన కైలాసానికో వెళ్ళాలనే కోరుతోంది. ఇటు పంపిస్తావో అటు తీసుకెడతావో - ఏమైనా ముందీ వ్యాధి తగ్గడంలేదు ప్రభూ ! ఏంచెయ్యమంటావు ?

మ. అతితిక్తంబగు నౌషధంబు, మధురం బౌ నీదునామంబు, నేఁ
బ్రతివారంబును శ్రద్ధ, భక్తి : నియతిం, బాటించి సేవించెదన్ !
మం నానాఁటికి రోసె నాద్యమునకున్! భద్రాత్మ ! యన్యం బొకం
డె తెవుల్ మాన్పనొసంగు మాజ్ఞదయఁ దంద్రీ! భక్తచింతామణీ. 249

తా. అద్వయా ! వ్యాధి పీడాగ్రస్తుడినైన నేను విముక్త్యర్థంగా - అతిచేదైన ఔషధాలనీ, అత్యంత మధురమైన నీ నామాన్నీ కూడా - నిత్యం శ్రద్ధా భక్తులతో నియమ నిష్ఠలతోనూ సేవిస్తూంటాను. రోజురోజుకీ ఆ మొదటిదాని (చేదు ఔషధం) మీద వెగటు కలిగిపోయింది. ఇక రెండవ దాన్ని (నీ తీయని నామస్మరణ) మాత్రమే నిత్యం సేవిస్తూన్నాను. దయచేసి దీనికైనా నా రోగం కుదర్చమని అజ్ఞ నియ్యి.

శా. స్వాంతంబందున దుర్వితర్కములు, సవిశ్వాసంబు, నాస్తిక్య, మూ
వంతేనిం దలచూప కున్న, బరమాత్మా ! తావకాంఘ్రిద్వయీ
చింతానందశతాంశ మేని, నిఖిలక్షిత్యాధిపత్యంబు నా,
నెం ? తాస్వర్గపతిత్వ మైనఁ గలదా యీ ? భక్తచింతామణీ. 253

తా. సర్వాంతర్యామీ! అసలు నా మనసులోనే యేదో - కుతర్కం, అపనమ్మకం, నాస్తికత్వం లాంటివి యేపినరో లేకుండావుంటే - సర్వ ప్రపంచానికి సార్వభౌమత్వం గాని, ఇంద్ర పదవి గాని - నీ పాద చింత నానందంలో వందో వంతయినా యీయగలవా ? (ఈయలేవు.)

మ. జడిగా నా కనుదోయి రే దొరఁగుబాష్ప శ్రేణీ, యీ పీతునం
బడి పాదంబుల వెచ్చవెచ్చగ, భవద్భావంబు రంజించెనో,
యడలుం జూడఁగ లేవినీకవికరం బవ్వారి గావించెనో,
చియుడు కాజెన్ఃపదుదర్క నూ యది నాఃకో భక్తచింతామణీ. 254

తా. నా కళ్ళవిండా నీరు క్రమ్మి ఏకధారగా ప్రవహిస్తున్నాయి. ఈ వెచ్చని నీరు నీ పాదాలు తాకిందా ! కవికరం కలిగిందా ! నా మోడు మొట్టయి చేయలేని పనిని ఈ కాసింత కన్నీరు చేసిందా తండ్రీ ! ఎంత అదృష్టం !

శా. కారుంజీకటి గ్రమ్ము రే గడచి, యర్కజ్యోతితోఁ తెంచుచోఁ,
దారు న్నిద్దుర:దుఃఖధామ రుజ యంతం బొందు, నాపై భవ
త్కారుణ్యం బుదయించున ట్లగుట మేల్కాంటి న్నినున్ వేఁడ: నా
కారోగ్యంపుదినంబుఁగా న్నిఁక ధ్రువం బౌః భ కచింతామణీ. 255

తా. చీకటి రాత్రి - ఉదయం లేచేసరికి నా జబ్బుతగ్గి, నీ దయ నాపై కలిగినట్లుగా కలగని లేచి నిన్ను ప్రార్థిస్తున్నాను. వ్యాధి మూదురుతుందని నమ్మకం కలుగుతోంది.

మ. అడుగుల్ చుట్టన పేఁడియశ్రువులు నే నట్టుల్ దొరంగించి పో
క్కెడురే గా, భవదంతరంగము గరంగెౕ ? దానికిం దేవ ! య
ప్పుడె తాపాకఁగ నాదె లో నుడుకు ! చెయ్యేల్ భక్తునుల్లంబు, నె
క్కుడు శోధింపక, తేర తీరువపు కోర్కుల్: భక్తచింతామణీ 256

తా. నీ అరికాళ్ళు చుట్టుమనేలా - నా పేడి కన్నీళ్ళతో పాదాభిషేకం చేసిన దానికి నీ హృదయం కరిగింది. అందుకు నాకు తాపాకఁకాలు కనుపిస్తున్నాయి. లోపల ఉడుకు తగ్గింది. భక్తులు ఎంతగానో రోధిస్తేనే తప్ప కోరికలు తీర్చవు కదా ప్రభూ !

శా. ఈ నిశ్శబ్దపురేయి హృద్భరముతో నేఁ బెట్టుసీక్షాయి నీ
వీనుల్ సోఁకకపోదు; దానిసెకచే, వెన్నన్ దలంపింప నీ
దౌనుల్లంబు గరంగకుండ; దనుకొం చాసానఁ జూతున్ దెసల్;
నే నాలింతు బయల్; గుదర్ప పె యొడల్ వే; భక్తచింతామణీ, 261

తా. హే భక్త చింతామణీ ! నడులుడిగిన యీ నడి రేయి - హృదయ భారంతో నేను పెట్టే మొఱ నీ చెవులకు చేరకపోదు. దాని సెగ వలన, వెన్న వంటి నీ మనసు కరగకనూ పోదు - అనే భావంతో యెంతో ఆశతో నీ రాకకై నల్దిక్కు-లూ చూస్తున్నాను. ఏదీ కనపడదు - ఆకాశం తప్ప యేదీ వినబడదు. నా శరీరాన్ని నయం చెయ్యి స్వామీ.

మ. మరువుల్ బెగ్గిలఁజేయుఁ గాఁగుచెదుగున్మా నేయి, యాపొంగు చె
చ్చెరఁ బోకార్పగుడంబు, నామదికిఁ దోఁచెన్, గుత్తుకం దట్టి యూ
పిరి యాడం దెరు వీనిదున్క-వము, తద్వృద్ధింద్రుటిం బావుత్వ
చ్చరణధ్యానమరందసేవనము, నెంచన్; భక్తచింతామణీ. 262

తా. ప్రభూ ! చెడ్డనయిన నెయ్యీ నూనెలు మరగలు గక్కు-తూ పొంగుతాయి. కాస్తంత బెల్లపు ముక్క-ను పడవేస్తే ఆ పొంగదే అణిగిపోతుంది. అదే విధంగా - లోనుండి ఎగదట్టి, గొంతు కడ్డంపడి, ఊపిరాడనీయకుండా వున్న నా కఫవృద్ధికి - నీ పాద స్మరణమనే తేనెను త్రాగడ మొక్క-టే విరుగుడుగా భావిస్తూన్నాను.

శా. సంసారాబ్ధిఁ దరించి నీదరికి రా, సర్వేశ ! నీవాత్మకున్
మాంసా ప్రాంత్రవసాస్థిచర్మఘటితన్ నౌకం బ్రసాదింపఁగా,
హంసప్రేరణ సాగుయాత్రను సిరాగ్రవ్యగ్రహ ప్రాగ్భల
ప్రంసం బైనటు దోఁచు; మాకొ్కా-లుపు! మీశా ! భక్తచింతామణీ. 263

తా. సంసార సాగరాన్నీది రమ్మని - శరీరమనే నావను జీవుడికిస్తావు. ప్రాణ ప్రేరణతో సాగుతూన్న ఈ యాత్ర కపాంతరం కలుగుతూన్నట్లుంది. కాపాడు తండ్రీ.

శా. ఆకాశం, బనిలంబుఁ, దేజమును, దోయం, బుర్వి, లేనట్టికో
నేకాంతంబు వసించువాఁడు గలఁ డే, నీ కద్భ్యేదన్ వానికిన్,
నీకంటం బడ కుండఁ గార్య మొకటిన్ నేఁ జేయఁగాఁ జాలినన్ !
నాకృత్యంబు లడంపు: సర్వదురితఘ్నా ! భక్తచింతామణీ 267

తా. ఆకాశము, అగ్ని, వెలుగు, నీళ్ళు భూమి - అనే వేవీ లేని చోట యేకాంతంగా వుండగల వాడంటూ యెవరైనా వుంటే - వాని నీడలో చేరతాను. ప్రభూ - ఏ ఒక్క కార్యమైనా నీకు తెలియకుండా నేను చేయగలిగితే - నా సమస్త పాపాలనీ అణచు. పాపహారకా ! నీ కిదే నమస్కారం.

మ. దురితవ్యాధిభవంబు లంచు, దరి, హద్దుఁగా లేనెడారిఁగా మహా
మరుభూమిఁగా మకరాలయంబు స్మరియింపఁజేయు: వన్ గర్మ మం
దురలం బ్రోయఁ, దరింప నౌ పెరవుఁ గన్గొంటిన్; విముక గంటి: నా
కరుపంబుం గలిగింపు మర్హ గతిఁ బ్రాపై: భక్తచింతామణీ 268

తా. ఎడారిలో మంచినీటి చెలమని కనుక్కున్నట్లు - జబ్బులలో మూడుకున్న ఈ జన్మ సముద్రానికి తీరాన్ని కనుక్కున్నాము. ఆ తీరం చేరేందుకు నీవే దారిగా నమ్మాను. నా కండగా నిలిచి, తరించే అర్హతను ప్రసాదించు స్వామీ !

మ. భవరాహిత్యము నాకు సల్పిన, భవద్బ్రహ్మాండసంసర్జన
వ్యవహారంబున కేమి లోపమగునా ? త్వల్లోకమం దుండనా ?
భువి సర్గంబయి, కాక యున్నె దివి ? వఁగా ముక్తాత్ములై నట్టి నీ
వివిధస్థానకవీథులం గలుపు భావిన్; భక్తచింతామణీ 269

తా. నాకు మోక్షమిచ్చినంత మాత్రాన - ఈ సృష్టిలో సమతుల్యతేమైనా లోపిస్తుందా ! ఇక్కడ లేకపోయినా నీ దగ్గరే వుంటాను గదా ! దయచేసి నాకు నీ శ్రీ పదాన్నిచ్చి, అక్కడున్న భక్తులైన నీ ఆస్థాన కవులలో కలుపు తండ్రీ !

మ. ప్రతివారం బొకదివ్యసిద్ధఫలముం బ్రత్యూషకాలంబునన్
క్షితిపై రాల్చురసాల మున్నయెడ, నీఁ చింతామణీసూనుబిం
దతమోభేదక పద్యరత్నము లటుల్ నాబుద్ధిఁ దోఁపించు భ
వ్యతరుం బోలుచు దానితో; నమ్మృతనామా ! భక్తచింతామణీ 270

తా. రోజూ ఉదయమే ఒక సిద్ధ ఫలాన్ని రాల్చే చక్కటి మామిడి చెట్టు వలె - నీవిలా - యీ చింతామణీ కావ్యాన్ని వ్రాయించుకుంటున్నావు.

మ. "చలనం బొందు జడంబు సూచిక, యయస్కాంతంబుచెంతన్ నిలన్;
నలుపున్ మాయ భవత్సకాశమహిమన్ సర్గంబు నమ్మాడ్కి:" నన్
వలుకొప్పున్; మన సాత్మ సన్నిధిని స్వప్నంపుంబ్రపంచంబు భా
సిలఁగా జేయదె నిద్రయం ? దఖిలసాక్షీ ! భక్తచింతామణీ. 274

తా. చైతన్యంలేని యినుముకూడా, అయస్కాంత స్పర్శతో చలనాన్ని పొందుతోంది. అదే విధంగా నీ సేవా భాగ్యం వలన జడుడినయిన నేను కూడా చైతన్యవంతంగా మనగలుగుతున్నాను.

మ. పొసఁగుం దావక భూతసృష్టివిధికిన్ మృ, త్యుల్లరుం గొన్న స
వ్యసనంబున్ భవబంధముక్తి కని, దేవా ! నీవు లో నంతరా
యసహస్రంబు ఘటించుకామమదమోహద్రోహంబు జేర్పుటన్,
వసమే సంసృతి దాఁటఁ గోటి కొకఁడైనన్ ? భక్తచింతామణీ. 275

తా. నీ సృష్టిలో అందరికీ మరణాన్ని విధించావు. మరణానంతరం నిన్నందుకునే అవకాశాన్నీ యిచ్చావు. కాని, తండ్రీ ! జీవితానికి కామక్రోధాది అరిషడ్వర్గాన్ని జోడించడం వలన మేము దుష్కర్మలపాలై -నిన్నందుకోలేక పోతున్నాము ఈ జనన భారాన్ని తరించడం మావల్లనయ్యే పనేనా ? అనుగ్రహించి, సహకరించు తండ్రీ !

శా. ఏదో నాచెవి కొక్కనాదః మది గా కేశబ్దమున్ లేనిహ్రా
ద్వేదాపాదివిశీథగాఢతమగంభీరాంధకారాబ్ధికిన్
మీఁదై, నీదుజగాన కొక్కఁడవు తండ్రీ ! యెట్లు గా వుందువో
యాదిత్యాదులవెల్గు నీకుఁ బని లేదా ? భక్తచింతామణీ. 276

తా. ఏదో చిన్న శబ్దం తప్ప చెవి కేమీవినబడదు. అంతా చీకటి. ఎవరూ తోడుండరు. అ నిశ్శబ్దంలో కాస్సేపుండడమే నాకు కష్టంగా వుంటే సృష్ట్యాదిని -ఏమీలేకండా యెవరూ లేకండా-ఒంటరిగా ఎలా వుండగలిగావు తండ్రీ !

శా. ఈ లోకంబున, నీకటాక్షమహిమంబే తక్క. నేకాంత మే
నాలోచించిన, హృద్జ్వరం బపరిహార్యశోకమే కాని, క
ష్టా ! లేశంబును జిత్తశాంతి హృదయాహ్లాదంబుఁ గావింపమిన్.
వాలాయంబు నిశిత మెంతు నిను; దేవా ! భక్తచింతామణీ 277

తా. నీ కరుణామృత వీక్షణం తప్ప-ఈ ప్రపంచంలో రవ్వంతయినా మనశ్శాంతి నిచ్చేదిగాని, శాశ్వత ఆనందాన్నిచ్చేదికాని యేమీలేదని అర్థమైపోయింది అందుకే అనుక్షణం నేను నిన్నే స్మరిస్తాను-

మ. మనుజాల్ మున్నగు ప్రాణు లన్నిటికి జన్మం బీశ ! గల్గించువి
త్తనముల్, విత్తు విధానముల్, పెరుఁగు క్షేత్రంబుల్, విచిత్రాకృతుల్;
జనకా ! యిట్టివి సృష్టియం దరసి, యుష్మల్లీలకున్ నవ్వకొం
చును, లోఁ గొంకుదు, వేఁదు ఆంద్రోయనుకొంచున్; భక్తచింతామణీ 281

తా. సృష్టిలో అందరికీ అన్నమిచ్చేది నువ్వేనయినా-ఆ అన్నాన్ని పండించు కోమని మనిషికి చెప్పావు. విత్తులుతెచ్చి, నేలను దున్ని, నాటి, నీరుపట్టి, పండించి; కోసి-వీళ్ళు పడే అవస్థ చూసి వినోదిస్తావు. అదిలో నువ్వీ శ్రమలేమీ లేకండానే ఎలా సృష్టించావో ఆశ్చర్యం ప్రభూ !

శా. మేలుల్ గీడులు కాలగర్భమున సామీ ! దాఁగి నీ సైగలం
బైలై, పంచినవట్ల కేగి తమ సామర్థ్యంబు సాగించెదున్ :
గేహసౌధమునందు సుందరులతోఁ గ్రీడించు నొక్కండు; పా
తాళం బంట నొకంటు మున్నుఁ బెనువంతన్; భక్తచింతామణీ 282

తా. జగద్విధాయకా ! మంచిచెడులనేవి నిత్యం నీ వంచనే పడివుంటాయి. నువ్విచ్చే సైగల్ని అనుసరించి, అవి, యెవరెవరికి చెందాలో వారివారికి సంక్రమిస్తూం టాయి. మంచి సంక్రమించినవాడు పడగ్గదిలో-పడుచులతో సుఖిస్తుంటాడు. చెడు సోకినవాడు చెప్పరాని దుఃఖాలతో అధఃపాతాళానికి అణిగిపోతూంటాడు.

శా. గాలిం బట్టపగల్ నభంబునఁగనుల్ గానంగ రాకుండ మే
ఘాలెందుండియొ మూఁగి, యవ్వి మరలన్ గాలిం బటావంచ లౌ
లీలన్, హాయిగ నుండుచో నదరి బల్ క్లేశంబు, లాకస్మికం
బౌలన్ మాయ మగున్ భవన్మహిమ; దేవా; భక్తచింతామణీ 283

తా. హాయిగా గాలివేస్తోంది అనుకుంటే, ఆ గాలిని నిరోధిస్తూ ఆకాశమంతా చూపానవంత చీకటిని సృష్టించే దట్టమైన మేఘాలు క్రమ్ముకుని, ఉక్కబోతని కలిగిస్తాయేగాని, ఊపిరాడనివ్వవు. తీరా చూస్తే - అంతటి మేఘాలూ కూడా గట్టిగా గాలి (ఋతుపవనాలు) వీస్తే చెల్లా చెదురయిపోతాయి. అదే విధంగా-కష్టాలు క్రమ్మినా, సుఖాలు మూగినా - మరుక్షణమే అవన్నీ నీ మహిమ వల్ల తారుమారయి పోతాయి గదా తండ్రీ !

## భగవత్సేవ

మ. వివిధం బైనప్రపంచవాంఛలను ప్రావృట్కాలకల్లోలినీ
నవవారిప్రతిమాన మైనమనమున్, నైర్మల్య మొందింపఁగా.
భవదీయాచలపాదసేవ కతక ప్రాయంబటం చెంచి మ
త్కవనంబుం బచరింతుఁదత్కృతిః ముకుందా ! భక్త చింతామణీ ! 287

తా. అనేక రకాలయిన ప్రపంచ వాంఛలతో - క్రొత్త నీరు తగిలిన వరద వదిలా తయారయిన నా మనసును - నిర్మలం చేయటానికిగాను, నీ యొక్క సుస్థిర పాదసేవ ఒకటే దారిగా భావించి, నేను నా కవిత్వాన్ని నీ పదాలకే అంకితమిస్తున్నాము.

మ. ననుఁ గష్టంపడఁజేసి, తత్ఫలమహానందంబుఁజేకూర్పఁ గా.
ననుకంపామతి నేర్పితీవు కవనం బల్లంగ నీమీఁద! నో
యనఘా ! నేరను నేను వేఱొకటి ని న్నారాధనం బాచరిం
పను; జాబిల్లికి నూలిపోఁ గమృతధామా ! భక్తచింతామణీ! 288

తా. అమృతధామా ! నాకు అనేక కష్టాలు కలిగించి— అవన్నీ మరిచిపోయేందుకు వీలుగా, నీ మీద పద్యాలను వ్రాసే కవితా శక్తిని నాకు ప్రసాదించావు. సంతోషం స్వామీ ! యీ విధానంతప్ప, నిన్ను పూజించే మరో పద్ధతి నాకు తెలియదు. నీవిచ్చిన యీ పద్య రచనా శక్తినే- చంద్రుడికో నూలిపోగన్నట్లుగా నీకు సమర్పిస్తున్నాను.

మ. కవితం గా పుటి కెచ్చరింప నను, నీ కల్యాణకృత్యాదముల్
భవనాశంబులు మోక్షరాజ్యపదపీఠ్రాసనారోహణో
త్సవసంధాయకముల్ సదా గొలువఁ ద్వత్కారుణ్య మే మందు ? మా
నవజన్మంబునకున్ ఫలం బదె గదన్నా ? భక్తచింతామణీ ! 289

తా. నీకళ్యాణ కృత్యాలనే కవులు పాడుకుంటారు. అవి పాపనాశనాలు, మోక్ష సింహాసనాన్నధిరోహింప చేయగలవి నీ కరుణనేమని కీర్తించను ? మానవ జన్మకు నీ దయేకదా సిద్ధఫలం !

మ. చనె నిర్బంధపురాచికొల్వు: పరమేశా ! కొంచు విశ్రాంతి పే
తనమున్, నల్పుచు దేశకాలనియమాతంకాది శూన్యస్వతం
త్రనిరాయాసపునిత్యజీవనభవత్సం పేవనంబున్ జరన్,
ననుఁ జేయన్ భవబంధముక్తుని: ముకుందా ! భక్తచింతామణీ. 294

తా. జగదీశ్వరా ! తప్పని సరియైన చేసే రాచ సేవ ముగిసింది. (రిటైరయ్యాను). ఇక విశ్రాంతి జీతం (పింఛను) తీసుకుంటూ- సదా నీ సేవలో- దేశకాల, నియమాలేవీ పాటించనవసరం లేని - ఆయాసపడనక్కరలేనీ-స్వతంత్ర జీవనాన్ని గడుపుతుంటాను. తండ్రీ ! నన్ను బంధవిముక్తుణ్ణి చెయ్యి.

శా. నాకంబున్, జలదంబు, నోషధులు, నన్నంబుం, బుమాంసుండు, స్త్రీ
నైకంబుల్ జనిఘట్టముల్ గడచి జీవాత్ముండు వచ్చున్ జనున్;
రాకల్ పోకలు మాన్చిఁ నిత్యసుఖవిశ్రాంతిం బ్రసాదింపు ! దే
నా ! కైవల్యదసేవ ! కష్టవనదావా ! భక్తచింతామణీ.

తా. స్వర్గం, మబ్బులు, ఔషధాలు, అన్నం, స్త్రీ పురుషాదీ విభేదతలూ పురుళ్లూ పుణ్యాలూ-అన్నీ గడిచి జీవాత్ముడు వస్తాడు, పోతాడు. ఈ రాకపోకల్ని ఆపి- ఎల్లవేళలా సుఖాన్నీ- విశ్రాంతినీ అనుగ్రహించు. దేవా ! కైవల్య పదంచేత సేవించబడేవాడా ! కష్టాలనే అడవికి- దావాగ్ని వంటివాడా ! భక్తచింతామణీ ! నీకు నమస్కారం.

మ. తనువుండబట్టి క్షుధాదికంబులు; తదర్థం బర్థ మద్దానికై
ధనికారాధనః మాత్మ గౌరవము దగ్ధం బందునన్; దానిచే
తను దాటింపమి యుచ్చనీచములు: బాధామూల మి ట్లిక్కటా !
జని; మానింపవె జన్మదుఃఖ: మఖిలేశా ; భ క్త చింతామణీ 296

తా. దేహంవల్లనే ఆకలిదప్పులు, ఆ నిమిత్తంగా ధనం, అందుకోసం ధనవంతుల్ని ఆశ్రయించి-వారిని సేవించడం ఆ కారణంగా ఆత్మగౌరవం నాశనం కావడం, ఉచ్చనీచాతి క్రమణం-ప్రభూ- ఈ విధంగా ఈ జన్మ బాధామూలమే తప్ప అన్యం కాదు. దయచేసి ఈ జన్మదుఃఖాన్ని నివారించు.

మ. భువియే గాదు, జయించి మూఁడు భువనంబుల్ గూడఁ బాలించు శూ
రవరేణ్యుండును, దీనవృత్తి నతుఁడై ప్రార్థించువాఁడైననీ
నవిధంబందున తక్క, నొందువలనన్ స్వామీ! త్వద్దైవ్యంబు వె
ల్వవిపత్త్రాణదనిమాని, ధన్యుఁడని తోఁచున్ : భక్తచింతామణీ 300

తా. ఒక్క భూమినే కాదు, మూడు లోకాలనీ జయించి పాలించేవాడయినా సరే- తన విపత్తు నందు నిన్ను మాత్రమే ధ్యానించుకుని నీ దయా బలంతో మన గలిగితేనే ధన్యుడని భావిస్తాను.

## సానుతాప ప్రార్థన

మ. మనసుం ద్రోయును వహ్నికుండమున సంసారంబు: తత్తాపమే
ననుభూతిన్ గ్రహియించి భీతమతినై, యానందనంధాయి వం
చనుకంపానిధి వంచు, నార్తశరణుం డంచున్, విను గొల్చెదన్;
ననుఁ దప్పింపవె దానిబారికి ! ముకుందా ! భక్తచింతామణీ. 301

తా. ఈ సంసారం - నా మనస్సును అగ్ని కుండంలోకి నెట్టివేసింది. ఆ భయంకరమైన వేడినీ- అనుభూతిని పొంది, భయపడినవాడినై - ఆనందాన్ని కలిగించేవాడివీ, దయామయుడివీ, అర్తులకు శరణ్యుడివీ అని నమ్మి నిన్ను సేవించుకుంటాను. నన్ను సంసారంబారినుంచి రక్షించుము.

మ. మనసా చంచల: మీషణత్రయము త్రెంపన్ రానిబంధంబు ! మే
ననిశం బైహికసౌఖ్యలంపటము: కామాదుల్ పరద్వేషు: లీ
వన, సుజ్ఞానసుయోగగమ్యుఁడవు: సాధ్యం బౌనె మోక్షంబు నా ?
తను జీవాత్మునికుంద్మువానవె ! ముకుందా ! భక్తచింతామణీ. 302

తా. మనసంటావా - కుదురులేనిది ! దారాధనపుత్రేషణాలు మూడూమా- త్రెంచుకోలేని బంధాలు ! శరీరమా- నిత్యం భౌతిక సుఖవాంఛలకి ఆలవాలం ! కామక్రోధాదులా- పరమశత్రువులు ! ఇక నాకు మోక్షం యెలా దొరుకుతుంది ? నువ్వంటే-చక్కటి జ్ఞానానికీ, యోగానికి గమ్యస్థానాలవి ! తండ్రీ ! నా జీవుడి వేదనని తొలగించు.

మ. తనువుల్ పెక్కులు దాల్చి యైన, దుద నాత్మజ్ఞాననిర్మోహుఁడై,
యనఘుండై, పెడఁ బాసి సంసరణ, మైక్యం బొంద నీలోన. జీ
వున కెంతో యవకాశ మిచ్చినదయాంభోరాశి వంచున్, సదా
మన మెప్పొంగ భజింతు నిన్నుఁ బరమాత్మా ! భక్తచింతామణీ. 306

తా. అనేక జన్మ లెత్తినప్పటికి, నీ భక్తుడై తుదిగా నీలో అయిక్యమయిన వాడే ధన్యుడు.



మ. జనకా: తావకసృష్టవర్గపరిరక్షన్ జాగరూకుండ వై
గనిశం, బేమఱుపాటు లేక త్రుటియే, నమ్యోయపాయంబులన్
గనలే మే మవి: యేతదంశము నెఱుంగన్, మాకు నీ బిడ్డయా
కనుఱెప్పల్ వరమేశ ! సాక్షి తిరువంకన్ ! భక్తచింతామణీ 307



తా. తండ్రీ! నీసంరక్షణలో సర్వదా మేము భద్రంగా వుంటున్నాము. కంటికి రెప్పవలె నీ వెల్లప్పుడూ రెప్పవాల్చకుండా మమ్మల్ని కాపాడుతున్నావు. మా కను రెప్పలు వ్రాలినా, నీవుమాత్రం- నిత్యం జాగరూకుడవే ప్రభో !



శా. సూరుం డస్తమితుండుగా, జగతికిన్ సోముం బ్రసాదింతు: నీ
హారాంశుం డరుదేనిచో మసతు తారాళిన్: సదా యుం తిరుల్
వారింపన్ శిఖి: నిట్లె భక్తుల నెగుల్ వాపంగఁ జూపింతు వా
ధార మ్మొక్కఁడు పో, మతొక్కఁడు: మహాత్మా ! భక్తచింతామణీ 308

తా. సూర్యుడస్తమించగానే, ప్రపంచానికి చంద్రుణ్ణి ప్రసాదిస్తావు. చంద్రుడు కూడా లేకపోతే నక్షత్రాల నుంచుతావు. సర్వదా చీకట్లను తరిమేందుకు అగ్ని నుంచుతావు. అదే విధంగా-భక్తుల విపత్తులు తొలగేందుకు కూడా-ఏదో ఒక ఆధారం-అది కాకపోతే మరో ఆధారం చూపిస్తూంటావు.

మ. అనన్న ప్రసవం దనూజను. రుజన్ ప్రాణప్రయాణోత్కటా
యాపాయ త్తను సత్త నింటఁ గని, ని న్నార్తిన్ ప్రభూ ! వారి కే
మోసంబున్ ఘటియిల్ల కుండఁగ శుభంబుం గూర్చ రే వేడుకోఁ
గా. సిల్గుల్ దొలఁగించి మే లిడితి వేగన్: భక్తచింతామణీ. 309

తా. పురిటివేళ దగ్గరపడి వ్యాధిగ్రస్తమై మరణావస్థగా వుండి, ఆక్రందింపున్న కుమార్తెకై నిన్ను వేడుకోగా- ఆపదగ లెక్కించి శుభం కల్గించావు తండ్రీ !

మ. జడ మౌనీజగదండషండమునకున్ జైతన్య సంప్రాప్తి నీ
కడకంటం బ్రసరించుచూడ్కి న కదా: కళ్యాణసంధాయి ! యీ
తడ వే శ్రావణశుద్ధపంచమిఁ, బ్రమోదం గంటిఁ, బుట్టిందిథిన్;
గడచెన్ డెబ్బదియూఱవబ్ది మిది వేడ్కన్: భ క్తిచింతామణీ 314

తా. అచేతనాలూ, శుద్ధ జడపదార్థాలూ అయిన ఈ అజాండ ఖాండాలన్నిం టికీ నీ కడకంటి కటాక్ష వీక్షణ మొక్కటే చైతన్యం కదా ప్రభూ ! అలాటిది - నాపట్ల నీ దయ వేరే చెప్పాలా ? ఎప్పుడూ శుభాలనే కలిగించేవాడా ! ఈ ప్రమోద నామ సంవత్సరంలో కూడా- నా జన్మ తిథియైన శ్రావణశుద్ధ పంచమిని జరుపుకో గలిగాను. ఇంతలో డెబ్బయ్యారేళ్ళు నిండి, డెబ్బయ్యేడో సంవత్సరంలో అడుగు పెట్టాను. ఇంతదనుకా నీ కరుణకివే నా కృతజ్ఞతా నమస్కారాలు తండ్రీ !

శా. జ్ఞానం బింతయు స్వామ్యధీన: మది నానారూపమై తోఁచు: నే
జ్ఞానం బైన భవత్ప్రసాదమునకే సంధిల్లెడుం దేహికిన్;
దీనత్వంబున మోఁకరిల్లి నినుఁ బ్రార్థింతున్: దయన్ దేవ ! యీ
సూనుం జేయు కుశాగ్రబుద్ధిని సుశిష్యున్: భ క్తిచింతామణీ. 315

తా. జ్ఞానం సర్వం నీ అధీనమై వుంటుంది. అది నానారూపాలుగా వెలువ రింపబడుతుంటుంది. ఆ జ్ఞానం యేదైనా నీ ప్రసాదానికే బాటలేస్తుంది. అందుకే నీకు మోకరిల్లి ప్రార్థిస్తున్నాను. ఈ బిడ్డనీ సచ్ఛిష్యుణ్ణీ, సూక్ష్మబుద్ధినీ చేయి.

## భ క్త ల క్ష ణ ము

మ. పిడికింటన్ రతనంబు నుంచుకొని, యావీశింపఁగా నిద్ర రే
యొద లీమెల్ల ప్రపంచమున్ మఱచి, ప్రత్యూషంబునన్ దెల్వి రా
బడుకింటన్ మణి వాఁడెటుల్ దడవు మున్ భక్తుండు మేల్కొన్న వెం
బడి నిన్ రక్షకు నట్టు లారయును: దేవ ! భ క్తిచింతామణీ 316

తా. చేత రత్నాన్నుంచుకుని, నిద్రామైకంలోపడి నిద్రపోయినవాడు-స్పృహ లోకి రాగానే, ఆ మణికోసం పడకిల్లంతా వెదుకుతున్నట్లు, భక్తుడైనవాడు జాగృతు డవగానే- జగద్రక్షకుడవయిన నిన్నుదేవిధంగా తలపోస్తాడు.

శా. నీతత్త్వ మ్మిద మిత్థ మంచుఁ దెలియన్ నిక్కంబు శక్యంబె? ప్ర
ఖ్యాతుల్ మువ్వురు మూఁడు త్రోవ లయిరం దేదో ఋతం?బెయ్యెతా
చేతం బయ్యెడ లూఁగుః భక్తియె నినున్ జేరన్ సుమార్గంబు! స
ర్వాతీతం బిది లేని తెల్వి వృథ గాదా? భక్త చింతామణీ. 320

తా. నీ యదార్థ తత్త్వం తెలియడం నిజంగానే యెవరివల్లా కాని పని. మహా మేధావులయిన ముగ్గురూ (శంకర, రామానుజ, మధ్వ) మూడు-మూడు రకాలుగా చెప్పారే కాని, ఏకవాక్యానికి రాలేకపోయారు. వాటిల్లో కూడా ఏది నిజమో తెలియక మనసు డోలాయమానమవుతోంది. తండ్రీ! ఇంతకు నిన్ను చేరేందుకు 'భక్తి' ఒక్కటే సరయిన మార్గంగా అనిపిస్తోంది. అన్ని మతాలకీ అతీతమైన సమ్మతం 'భక్తి' ఒక్కటే.

శా. తానీ పై నెడ లేక యుండుటయె కాదా యోగసంసిద్ధి? య
ద్ధానన్ సిద్ధుఁడు సర్వశక్తుఁడు, సమస్తజ్ఞుండు, నీయట్లుః దే
వా! నీ వాక్యము నందుఁ గల్గి దృఢవిశ్వాసంబు, యత్నించి యీ
మేనన్ ధన్యులు గాంత్రు తత్ఫలము, స్వామీ! భక్త చింతామణీ. 321

తా. తనే నీపై భేదం లేకుండా వుండటమే యోగసిద్ధి. తర్వాత సిద్ధుడు సర్వశక్తుడవుతాడు. సర్వజ్ఞుడవుతాడు. అందుకే యోగులంతా ప్రయత్నంమీద నిన్ను తమ హృదయాలలో దర్శించి - మమేకత్వకై సాధన చేస్తారు.

శా. నన్నుం గందును, మన్ను మిన్ను గనుచున్, నానాచరస్థావరో
త్పన్నత్వస్థితిసంహృతుల్ గనుచు, దత్తత్కార్య వైచిత్ర్యముల్
గన్నారం గనుఁగొందు, నిన్నటుల నే గాంచంగ లేకున్నఁ, గం
టున్న ట్లుల్లము పొంగుః విశ్వమయ! విష్ణూ! భక్త చింతామణీ. 322

తా. నన్ను చూసుకోగలను. నేలా, నింగీ, ఇతర చరాచర ప్రపంచాన్నీ, వాటి స్థితిగతుల్నీ చూడగలను. అనేక చిత్రకార్యాల నీ కళ్ళారా చూడగలను. కాని, ఆ విధంగా నేను నిన్ను చూడలేకపోతున్నానని దిగులుగా వున్నా, నా మనసు మాత్రం నిన్ను చూస్తున్నట్లే పొంగుతూంటుంది.

మ. నను దృష్టాంతముగా నొనర్చుకొనుచుం దృక్సృష్టలోకాళిపై
ననఘా ! తావకవత్సలత్వమును నే నాత్మన్ విమర్శింపఁ, దోఁ
చును మార్జాలకిశోరసామ్యః మెటె నేచున్ బ్రోచుకోఁ దమ్మునీ
కనుగ్రుడ్డుల్ జగదండముల్ భవదుపేక్షన్ ? భక్తచింతామణీ. 326

తా. పిల్లి పిల్లల్ని పెట్టి పదిళ్ళకి తిప్పినప్పటికీ - దాని దృష్టెప్పుడూ పిల్లల మీదే వుండేటట్లు - నువ్వు సృష్టించిన ఈ సమస్త లోకావాస జీవుల్ని - అయా కర్మానుగతంగా - ఇక్కడివాళ్ళ నక్కడికే బదిలీలు చేస్తూ కూడా — ఏ ఒక్కళ్ళనీ యేమరకుండా కాపాడుతూంటావు. అందుకునే నే నిదర్శనాన్ని గదా ! తండ్రీ ! ఇదంతా నీ అపేక్ష వున్నంత వరకే, ఉపేక్షించావో అండ పిండా లేవీ ఉండనే వుండవు గదా !

## ఆరోగ్య ప్రార్థనము

శా. నీ నామంబు స్మరించు చేఁ గొనుచుఁ దండ్రీ ! దేహరక్షార్థమై
నీ నిర్మించిన యౌషధంబు, పరముల్ నిస్సత్వముల్ కావుటన్
దేనెన్ మెన్పి భిషిజ్ఞ్నీ దేశమునః నే దీవింపవే దేవ ! నన్
జానూర్వంఘ్రులు జంఘలాది గుణ మొందెఁగా ! భక్త చింతామణీ. 327

తా. నా నరాలు బలహీనమయిన కారణంగా, తేనెతో కలిపి పుచ్చుకోవలసిందిగా వైద్యులచే యీయబడిన ఔషధాన్ని నీ నామస్మరణ పూర్వకంగా పుచ్చుకుంటున్నాను. నా తొడలూ, మోకాళ్ళూ, పిక్కలూ, పాదాలూ త్వరలోనే స్వస్థతను పొందేలా దీవించు.

మ. చెద లేచొప్పున నల్పు శిల్పికృతమూఁ ఛిన్నంబు గేహం, బటుల్
గదముల్ దేహముఁద్వద్వినిర్మితముఁ జీకాకుం బొనర్చుంః బ్రభూ !
యది శుభ్రం బొనరించుకోఁ గలుగు నెవ్వైనఁగా గృహస్థుండుః బా
గిది సేయం బవివాఁడ నీవెః భవభేదీ ! భక్త చింతామణీ. 328

తా. శిల్పులచే నిర్మించబడిన ఇల్లూ వాకిళ్ళను చెదలు ఏ విధంగా పాడు చేస్తాయో - అదే విధంగా నీచే నిర్మించబడిన మా శరీరాలనీ వ్యాధులు అతలాకుతలం చేస్తుంటాయి. గేహాల చెదలను తొలగించి ఎవరయినా శుభ్రపరచుకోవచ్చును - కాని మా దేహాల గద (జబ్బు) లను తొలగించి కాపాడటం మాత్రం — నీ ఒక్కడి వల్లనే అవుతుంది.

మ. కనుఁగోలే కునికిల్ విదేశమున విఖ్యాతంపుఁబట్నంబునం,
జెనువీధుల్ చిననందులన్ దిరిగితిన్ భీతాత్మతన్, న్వన్నమే
యనుకొంచున్ ద్రుటి మధ్యమధ్యమునఁ మిథ్యం గాజగంబెంచుచున్
నిను నట్లేఁగన గమ్యుఁ: మాన్పుమట ! భ్రాంతిన్ భ క్తచింతామణీ! 332

తా. తెలియని దేశంలో — గమ్యాన్ని గుర్తించలేక సందులూ గొందులూ సంచరించే కన్నా-మార్గదర్శకుడి వలన గ్రామంలాగానే- యోగానికి గురువవసరం. ఆ గురువుగా జగన్నాధుడివి నువ్వే దొరికావు నా అదృష్టం.

మ. కనుదున్ గల్లప్రపంచమును గలఁ న దేఁ గన్గొను జాగ్రద్దశన్
గనులం దన్నేడువిజ్జగంబు మరలన్ గాఢప్రసుప్తిం గనన్ !
ఘనమాయం బిదఁ ద్రోయ కీయనృతలోక ప్రాప్తి దప్పించి, ని
త్యనివాసం బిడు సత్యధామమునఁ నీకా ! భ క్తచింతామణీ! 333

తా. ఈ ప్రపంచం అంతా మాయయని తెలుసు. అయినా చూడడం తప్పడం లేదు. చూస్తే - ప్రలోభం తప్పడం లేదు. ప్రలోభం వల్ల సంసృతి తప్పడం లేదు. నిత్య నిత్యదానాన్ననుగ్రహించు తండ్రీ !

మ. అనుదుర్ కష్టమటంచు గర్భనరకంఁ బమ్మాటయాథార్థ్యము
దనుమానం, బనుభూతి లేమిఁ నిది ప్రత్యక్షంబః హేయాతిహే
యనికృష్టం బగుమేని యూడిగ మసహ్యం బౌమహాకష్ట! మీ
జనిదుఃఖంబును బాపు పాపుఁ వరమేశా ! భ క్తచింతామణీ ! 334

తా. గర్భ నరకమనేది దుర్భరమని చెబుతారు అది అక్షరాలా సత్యమే నన్నది నూటికి నూటయాభై పాళ్ళు నిజమేకావచ్చు. కాని, పుట్టిం తర్వాత యీ శరీరభారాన్ని వహించడం - ఈ శరీరానికి దాసినసై -అన్ని పాపాలూ వగై రాలన్నీ సమకూర్చడం - చాలా అసహ్యకరంగా వుంది. అంచేత మళ్ళీ యిలా పుట్టే కష్టం రాకండా నన్ను గట్టెక్కించేద్దూ !

మ. ఇహమందుం బరమందు సౌఖ్యమును కౌనేర్పాట్లకో, నత్యను
గ్రహబుద్ధిం బరమేశ! యద్భుతపువిర్మాణంబు, గావించి, యీ
మహనీయంబగుధర్మ సాధనపుమై, మా కిచ్చి: తిద్దావు, న
న్వహ మర్హ క్రియలం బొనర్చు తెలి విమ్మా: భక్తచింతామణీ! 338

తా. ఇహపరాలు రెండింటా సుఖపడేందుకు వీలయ్యే విధంగా– ఆద్యంతమూ ఆశ్చర్యదాయకమే అయ్యేలాగున, గొప్ప గొప్ప ధర్మకార్యాలను నిర్వహించుకో కలిగే ఏర్పాటుల్తో - ఎంతో దయతో మాకీ శరీరాన్ని నిర్మించి యిచ్చావు. పర మేశ్వరా! ఇటువంటి యీ ఉత్కృష్టమైన దేహంతో చేయదగిన మంచి పనులు మాత్రమే చేసే తెలివిని కూడా మాకు ప్రసాదించవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

మ. ధరలో నెన్నది నాల్గులక్షలు భవత్కారాగృహంబుల్ చరా
చరముల్: ద్రోసితి వందు: నిప్పుడిట శిక్షలబొందుచున్నార, వీ
శ్వర ! యిం కేచెరసాల కేయకుము, మాచ్ఛందల్సి, కిందుండి నా
యిర వొందం ద్వదమజ్ఞ నాకు దయ నీవే: భక్తచింతామణీ 339

తా. స్వామి ! భూమ్మీద ఎనభయినాలుగు లక్షల చెఱసాల (శరీరా) ల్నేర్పాటు చేసి- చరాచరాలనీ వాటిలో బంధించావు. నేనీ చెఱసాల (శరీరం)లో శిక్షననుభవిస్తున్నాను. ఇందులోంచి ఇంకా యే చెఱసాల (శరీరా)లకీ, అరలకీ బదిలీ చేయకు. ఈ శైమ (శరీరం) లోంచి బయటపడగానే నీ పాదాలు చేరుకునేలా అను గ్రహించు.

మ. మమతాశృంఖల మున్ దగిల్చి, పటుకామక్రోధలోభాదివ
ర్గముపై గా పిడి, బొందిబందియబు నిర్బంధించి, జీవాత్మ చే
శ్రమసంధాయక హేయకార్యచయమూ నల్పించె దెందాక నీ
యమబాధల్ ? పరమాత్మ ! నిత్యసుఖ మిమ్మా ! భక్తచింతామణీ 340

తా. దేవా ! మమకారమనే సంకెలవేసి, కామ క్రోధ లోభ మోహా మద మాత్సర్యాలనే కావలాదారుల్ని పెట్టి, ఈ బొందె అనే బందెల దొడ్లో- నిర్బంధించి జీవుడి_చేత నానారకాల నీచకార్యాలూ చేయించి శ్రమపెడుతూ - తబుద్ధి - ఇలా ఇంకెన్నాళ్ళీ హింసలు ? దయచేసి మాకు శాశ్వత సుఖాన్ని ప్రసాదించుము.

మ. గత మౌ కాలము ప్రాణరక్షకము; రాఁగా నున్న కాలంబునం
బ్రతి సూక్ష్మాంశ మతిక్రమించు దనుకన్ బ్రాణాంతకంబే, సుని
శ్చిత మౌటన్ మృతి మర్త్యమం; దనిశమున్ జీవింప యుష్మత్పద
స్మృతి గల్గింపు మరుక్షణం బమృతదాయీ! భక్తచింతామణీ 344

తా. ఇంతవరకూ జరిగిన కాలమే జీవించిన కాలం. రాబోయే కాలంలో ప్రతీ క్షణము కూడా గడిచేదాకా ప్రాణగండమే కదా! భూమిమీద ప్రాణులకు మరణమనేది నిశ్చయమయి పోయి వుండడం వల్ల-ఎవరూ శాశ్వతులు కారు. అయినప్పటికీ జగ న్నాయకా! అమృత మూర్తీ! బ్రతికినంతకాలం అనుక్షణం-నీ చరణాలను మా జ్ఞప్తి యందుంచు.

మ. నరులే యెన్బది నాల్గులక్షలను నిన్ లక్షింతు వా; రోమ హే
శ్వర! తక్కుంగల లక్ష లెన్బదియు నజ్ఞ ప్రాణులే; వారు నెం
దఱో నీ వంకకురారు వచ్చుసుతులన్ బహ్వల్ప సంఖ్యాకులన్
గరుణన్ దగ్గఱఁ దీయ నీకు భర మౌనా? భక్తచింతామణీ 345

తా. ప్రభూ! నువ్వు సృష్టించిన అనంత కోటి జీవరాశులలో-మా మానవులు ఎనభై నాలుగు (84) లక్షలు మంది మాత్రమే నిన్ను గుర్తించి ప్రార్థిస్తుంటాం. తక్కిన లక్షలాది ప్రాణికోటులూ జ్ఞాన రహితులే గనుక, అవి నీదరికే రావు. ఇక, జ్ఞానులమైన మా 84 లక్షల మందిలోనూ కూడా ఎవరో అతి తక్కువ సంఖ్యాకులు మాత్రమే నీ చేరువకి వస్తూంటారు. ఆ పాటి మందిని చేరదీయడం కూడా నీకు భారమేనా?

మ. ముద మొందం దలపోసి, దేవర పదంబుల్ గొల్చుకొం చుండఁగా
హృదయ క్షోభకరం బెదో దొసఁగు తండ్రీ! ప్రాప్తమౌచుండు; నె
మ్మది కారాటము గల్గకుండ నది యేమైనేని దప్పించు చి
మ్మదిమిన్ సౌఖ్యపువంబళం బొసఁగు; శంభూ! భక్తచింతామణీ. 346

తా. ఆనందాభిలాషినై-నీ పాదసేవ చేసుకునే సమయంలోనే-ఏదో విపత్తు వచ్చిపడి మనసంతా కలత పెట్టేస్తూంటుంది. నాలో గుండెయకియే ఆరాటము కలగ కుండా-ఆ విపత్తులను తప్పించి - ఈ నా ముసలి ప్రాణం కాస్తంత ప్రశాంతంగా సద్బ్రం గడుపుకునేలా చెయ్యి ప్రభూ!

మ. శుభవద్క్షేమనిధాయి! పుష్కరజనంబుల్ వేనవేల్ గౌతమీ
సవనం బాదిక రాణ్మహేంద్రనగరిన్ సర్వాశలందుండి తీ
ర్థవిధుల్ సల్పుకొనంగ మూఁగెదరు; చోరవ్యాధిబాధాదివి
ప్లవ మాంగీరస నొందనీకు ప్రజ దేవా? భక్తచింతామణీ 350

తా. భద్రప్రదా! ప్రజాపతినామ సంవత్సరానంతరంవచ్చే "ఆంగీరస" నామ సంవత్సరంలో మా రాజమండ్రిలో-గోదావరీ పుష్కరాలు వైభవంగా జరుగుతాయి. అన్ని దిక్కులనుంచీ అగణిత ప్రజాకోటి ఆ పుణ్యోత్సవ తీర్థవిధుల నిమిత్తం రాజమండ్రి చేరతారు. ఆ భక్తసమూహానికా సమ్మర్దంలో ఎవరికీకూడా దొంగల బెడదగాని, వ్యాధులపీడగాని, లేదా యితరమైన ఏ బాధలూ వంటి అపసవ్యాలు జరగకండా రక్షించు తండ్రీ!

మ. ప్రజకున్ స్వస్తి; మహీపతుల్ వసుమతిం బాలించుతన్ న్యాయతన్
త్రిజగంబున్ భజియించుఁగాక సుఖ మీదేశం బసంక్షోభ మౌ;
ద్విజగోసంతతి కౌ శుభం; బనుచు దీవింత్రార్యు లేపొద్దుఁ, ద
త్సుజనాశీస్సు లమోఘముల్ సలుపు, విష్ణూ భక్తచింతామణీ. 351

తా. ఆర్యులయినవారు-ప్రతిరోజూ కూడా ప్రజలకు "స్వస్తియగుగాక! పాలకులీ నేలను న్యాయమార్గంలో పరిపాలించెదరుగాక! ముజ్జగలవారూ సుఖింతురుగాక! ఈదేశం యెటువంటి సంక్షోభాలూ లేకుండా శాంతిమయంగా వుండుగాక! గోబ్రాహ్మణులకు శుభమగునుగాక!" అని దీవిస్తూంటారు. స్వామీ! భక్తచింతామణీ! ఆ సజ్జనులిచ్చిన ఆశీస్సులను అమోఘాలుగా చెయ్యి.

- తత్సత్ -